అతిత్వరలో!

మమకారానికి
మానవత్వానికి
మధ్య మానవులు
పడే సంఘర్షణ...

R.V.H.H. PRASAD'S SONS & CO
*Presents.* రోనా ఫిలిమ్స్ వారి

# తల్లీబిడ్డలు

స్క్రీన్‌ప్లే, రచన. నిర్మాణం
**యడవల్లి లక్ష్మీనారాయణ.**

దర్శకత్వం.
**P.S. శ్రీనివాసరావు B.A.**



PAAPS

డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర & సీడెడ్: ఎస్.ఎ.కె. నైజాం: శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్.

# అత్యున్నతమైన

# ఫ్రెంచి కాఫీ






ప్రత్యేకముగా రుచి ఎంచువారలకు సరిపడునట్లుగా బ్లెండు చేయబడి, అప్పటికప్పుడు గింజలను వేయించి పొడి చేయబడి, సువాసన వెలికి పోకుండ ఉండులాగున, బ్రూక్ బాండ్ కేఫే బ్రాండు ఫ్రెంచి కాఫీ సెలోఫేన్ సంచులలో మీకందజేయబడుచున్నది. శ్రేష్ఠమయిన దక్షిణాది రుచికల్గిన ఫ్రెంచి కాఫీ కావలెనంటే, బ్రూక్ బాండ్ మీదే ఆధారపడండి. మీరు కొనుటకు అత్యంత శ్రేష్ఠమయినది ఇది ఒక్కటే.

# బ్రూక్ బాండ్

# కేఫే బ్రాండ్ ఫ్రెంచి కాఫీ

## కథలు

"వాయిదా" కథ బాగున్నది. కాని ఎంత సరదా పుట్టిస్తున్నప్పటికి ఒక లెక్చరరు కాలేజీలో స్టూడెంటును "సూర్యుడు భూమధ్యరేఖమీద సంవత్సరానికి ఎన్నిసార్లు ఉంటాడు. ప్రపంచ మహాసంగ్రామాలలో మొదటి మహాడు ఏవి ? మార్కోనితో ఎవరు ? అని అడగడము నాకు చాల అసమంజసముగా తోస్తున్నది. అట్లా అడుగకూడదని నా ఉద్దేశ్యము. ఇదిగాక 'ఇంగ్లండు ఎక్కడ ఉన్నది' అని ప్రశ్నవేయుడము చాల పిల్లిగా కనపడుతోంది.

ఏ. సూర్యనారాయణ (వాల్తేరు)

* * *

మారుతిగారి "వాయిదా" బాగానే ఉన్నదిగాని చిన్న సందేహం. "మొదటి జీటిసి" కథలో కుశాలరావు (లెక్చరరు) "వాయిదా" కథలో కుశాలరావు (ఫుట్‌బాల్ ఛాంపియన్) ఒకరేనా. మారుతిగారు తమ రెండు కథలలో వివిధ పాత్రలకు ఒకే పేరు ఇవ్వడము ఎబ్బెట్టుగ ఉంది.

ఎస్. హెచ్. ప్రసాదశర్మ (హైదరాబాద్)

* * *

"మారుతిగారు వ్రాసిన "వాయిదా" చదివాము. అసలు కుశాలరావు వసంతను ప్రేమించినట్లు లేదు. నిజంగా ప్రేమిస్తే, వసంత నాన్నగారితో అలా మాట్లాడి ఉండకపోను. కథ ముగింపు కారణం గుణ్యంగా లేదు.

రచయిత (త్రి)గారు కథ ముగింపు "వాయిదా" వేసుకొనివుంటే బాగుండేది.

విజయ (పార్వతీపురం)

## సందేహం

24—8—62 వారపత్రికలో "అమరశిల్పి జక్కన" చిత్రంలో జక్కన (ఏ. నాగేశ్వరరావు) ఫోటో ప్రచురించారు. జక్కన మేకప్ చూస్తే —"మహా కవి కాళిదాసు" "భక్త జయదేవ" జ్ఞప్తికొస్తున్నారు. నిజమైన జక్కనకు ఈ జక్కనకు చాల భేదం కనిపిస్తోంది. నిజమయిన జక్కనకు—పిండ్లైన నున్నని గుండు, పిలక, శరీరముపై వస్త్రము లుండునట్లు అసలు రచయిత్రి కథలో వర్ణించినది (సస్తర్గి).

కె. హరీష్ (శ్రీకాకుళం)

మీ సందేహం మేము తీర్చలేము.

* * *

"సీత" కథ నాకు నచ్చలేదు. అయితే కథను మొదటినుండియు చక్కగా వ్రాసారు. కాని సీత భర్తయైన నీలకంఠం తనంత తానై వచ్చి పిలిచినా ఆమె వెళ్ళకపోవటం అంత బాగాలేదు. ఎందుచేతనంటే ఎప్పుడో అయిదేళ్ళ క్రితం కలతలు రావటంవల్ల దానినే మనసులో పెట్టుకుని సీత భర్తను నిరాకరించింది. అదీకాక మురళి "మా నాన్న ఎక్కడమ్మా" అని అప్యాయంగా అడిగినప్పుడు "వారు ఇక ఎన్నటికి రారు" అని ఫోటోను

# ఉత్తరాలు

చూచి అడటం ఏమంత సమంజసకరంగా లేదు. తన భర్త ఉండి కూడా లేదనేవారు ఇప్పటికి ఎవ్వరూ లేరని నా అభిప్రాయము.

రాధారుక్మిణి (తణుకు)

* * *

ఎం. ఎల్. పతిగారి 'పిటింగు' మమ్ము కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వించిందంటే నమ్మండి.

వి. ఆర్. ధన్‌రాజ్, సి. సరస్వతి (హైదరాబాదు)

* * *

ఎం. ఎల్. పతిగారి 'పిటింగు' అను కథ నన్ను చాలా ఆకర్షించినది.

ఎం. అరుణయ్యగౌడ్ (హైదరాబాద్)

## సరాగమాల

రంగారావుగారిస్తున్న రికార్డుల నంబర్లు ఎవరికైనా ఉపయోగపడుతున్నాయా అది తెలుసుకోవాలని ఉంది.

కృష్ణ (వైజాగ్)

## సీరియల్ కథ

"వెండిమబ్బు" కథ నాకు చాల బాగ నచ్చింది. కాని ఇంత తొందరగా, ఊహించనివిధంగా ముగుస్తుందనుకోలేదు.

రామనాథరావు (శ్రీకాకుళం)

* * *

"వెండిమబ్బు" ముగింపు చాలా బాగుంది. రచయిత్రి ఇందిర పాత్రను ఎంతో విందుగా చక్కగా పోషించారు. ఇందిరలాంటి వ్యక్తులు మన నిజజీవితంలో చాలా అరుదుగా కనపడతారు. కాని మోహనులాంటి వ్యక్తులు ప్రతినిత్యము కనపడతారు.

శివపరపు రావు (విజయనగరం)

* * *

"వెండిమబ్బు" కథ చాలా బాగుంది. కాని ఇందిర చివరలో అంత హృదయంలేని దానిలాగా, ప్రవర్తించి మోహన్‌కు తీరని అన్యాయం చేసింది! మోహన్ ఇందిరను పెళ్లిచేసుకోనని తాత్కాలికంగా బాధపెట్టాడుకాని ఇందిర జీవితాంతం .... అతనికి సుఖశాంతులు లేకుండా చేసింది. మోహన్ చేసిన చిన్న తప్పుకు అంతపెద్ద శిక్షా ?!

ఇందిర మోహన్‌ని నిజంగా ప్రేమించలేదు! ఒకవేళ ప్రేమించివుంటే ఏదో ఒక చిన్నతప్పు చేశాడనే కారణంతో అతనిని దూరంచేసుకుంటుందా !? ఇందిర, మోహన్‌ని నిజంగా ప్రేమించిందని ఎవరన్నా అంటే "ప్రేమ" అనే పదానికే అపచారముచేసినటుం అసమంజసము కాదనుకుంటాము.

నండూరి శాంత (గుంటూరు)

* * *

## హమేషా తమాషా

'హమేషా తమాషా' లో 'అంతా లాజిక్ కాదోయ్' వ్రాసినది 'కృష్ణానంద్'గారు కాదని నేనంటాను. మరి మీరేమంటారు? నే నన్నదాంట్లో లాజిక్ ఉందంటారా!

అల్లెన ధర్మారావు, (పాలకొండ

లేదంటాము.

## కార్టూన్

ఈవారపు (24—8—62) ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన శ్రీ జయదేవ్‌గారి కార్టూను అసంభవమనిపిస్తుంది. ఒక సిగరెట్టు కాలగనే పొగతో చీకటిమయమయిందా?

వి. రత్నాకర్, (బిలాస్‌పూర్)

## ముఖచిత్రం

ఆంధ్రపత్రిక 17—8—62 (స్వాతంత్ర్య దినోత్సవ సంచిక) ముఖచిత్రంలో ఉపాధ్యాయుడు జండా ఎగురవేయు సందర్భమున విద్యార్థులందరు తమ ఇచ్ఛాను సారంగా కార్యము జరుపుకొనుట చట్ట విరుద్ధంకాదా? పాఠశాలలోని విద్యార్థులు జెండా ఎగురవేయునపుడు 'ఎటెన్షన్'లో నిల్చుండుట వారి విధి గదా! ఇట్టి విషయము తమరు ముఖచిత్రమును సంగతు గమనించుట తగునా? కాదా? విన్నవింప గలరు.

కె. విక్టోరియా, ఇల్లెందు



చిత్తూరు ఉప ఎన్నికలో విజయం పొందిన ఆచార్య రంగా.

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం: 7—9—62

సంపుటము : 54 సంచిక : 53

శుభకృత్ సం॥ భాద్రపద మా॥ శుద్ధ అష్టమి

స్థాపితము :

1908

*

ముఖ్య సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు—రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

విడిప్రతి : 25 న. పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1





సినీ నటుడు రమణమూర్తి

# మనలోమాట

ఈ వారం ఒక చిన్న శీర్షిక ప్రారంభిస్తున్నాము. ఎఫ్. బి. ఐ. కథలు ఇచ్చిన సంస్థే ఈ శీర్షిక కూడా మాకు అందజేసింది. టెంపిల్ మానింగ్‌తో బాటు మీ రందరూ 'వివిధ ప్రాంతాలలోని వింత ప్రదేశాలు' చూడండి!

* * *

ఈ వారం ప్రపంచ ప్రముఖులు బాగా కుదిరింది! ఘనాలో జరుగుతున్న సంఘటనలు వెనుకబడిన దేశాల వారందరూ గమనించ తగ్గవి.

* * *

న్యూస్ ప్రింట్ కొరత కొంచెం తీవ్రంగానే ఉంటోంది! మా ఏజెంట్లు తమవద్ద చందా దారులుగా చేరిన వారికి ప్రాముఖ్యం ఇస్తారు. అందు చేత, చందా దారులుగా చేరిన వారికి పత్రికలు అందే అవకాశం ఎక్కువ ఉంటుంది!

* * *

శ్రీ శ్రీ కృష్ణ విదేశాలనుంచి తిరిగివచ్చారు. త్వరలో 'న్యూ ఢిల్లీ లేఖ' ప్రచురణ తిరిగి మొదలు పెడ్తాము. శ్రీ శ్రీ కృష్ణ తమ విదేశ యాత్రల అనుభవాలను గురించి వ్రాయవచ్చు.

# లోకంపోకడ



"అయ్యో! మరేనండి...నేను కూడా మీకు మల్లే పాఠశాలల్లో మాతృభాషలోనే బోధన జరగాలని చెబుతూ వుంటాను కాని ఏంచేస్తాం? మా పిల్లలను మల్లే మావాళ్ళు కూడా ఆంగ్లభాష, బోధన భాషగా గల పాఠశాల్లోనే చదువుతున్నారు."

## విషయానుక్రమణిక


స్వతంత్ర పక్షానికి టానికు!
రంగా విజయం


టిబెట్‌లో ఎన్నికలు జరగబోతున్నాయట
చైనా


కాంగ్రెస్
సోషలిస్టు
ఆశయం
అయితే బండిలాగేందుకు ఇంజన్ మాత్రం లేదు!


మునుపు గాంధీజీ లింలిత్‌గోని ఇలా కలుసుకోనగలిగేవారు


కెన్నెడీ క్రుశ్చేవ్‌ని.....


నెహ్రూ అయూబ్ ఖాన్‌ని......


అందుకని నెహ్రూ మావ్‌ని కలిసినా ఫరవా లేదు.

# ప్రపంచంలో కెల్లా చిన్న రిపబ్లిక్ శాన్ మారినో



శానమారినో రిపబ్లిక్

ఇటలీకి ఈశాన్యంగా "టిటానో" పర్వతంమీద ప్రపంచంలో కెల్ల చిన్న రిపబ్లిక్ ఉన్నది. ఈ రిపబ్లిక్ పేరు శాన్ మారినో.

ఇది స్థాపించి 1600 సంవత్సరాలు కావస్తున్నది. రోమన్‌ల బాధ పడలేక క్రిస్టియన్‌లు ఇక్కడికి పారిపోయి వచ్చేవారు. ఈ పరమాణువు యుగంలో పాశ్చాత్యసంస్కృతికి సంబంధించిన విలువలేని నిధులకు ఇది ఉనికిపట్టు కాబోతున్న దంటారు.

ఎందుచేతనంటే యుద్ధసమయంలో లలితకళలకు సంబంధించిన వస్తువులు నశించకూడదనే సిద్ధాంతం మొదటిసారిగా అవలంబించిన దేశం శాన్ మారినో.

అసలు శాన్ మారినో పరిస్థితి దీనికి అనుకూలంగానే వుంటుంది. అంతేగాక ఈ రిపబ్లిక్‌లో సహజమైన గూడు ఒకటి వున్నది. ఈ గూడు ఒక రెండు మైళ్ల నిడివిగల సొరంగం. ఒకప్పుడు ఇందులోనించి రైలుబళ్లు వెళ్లేవి.

ప్రపంచయుద్ధంలో బాంబులు పడినప్పుడుకూడా దీనిలోపల ఏ విధమైన అపాయము వుండేది కాదు. ఈ గూటిలో పలే కళానిధులు దాచడానికి కావల్సిన మరికొన్ని గూళ్ళు త్రవ్వడానికి శాన్ మారినో ప్రజలు సిద్ధంగా వున్నారు.

శాన్ మారినో చరిత్ర విచిత్రమైంది.

మారినస్ అనే శిల్పి క్రిస్టియన్ అయినందుకు రోమ్‌లో అధికారులు బాధలు పెట్టేవారు. ఈ బాధలు పడలేక ఇతను కొందరు అనుచరులతో టిటానో పర్వతంమీదకు పారిపోయాడు. పైన ముష్ఫై ఎనిమిది చదరపుమైళ్ళ భూమిమీద ఒక క్రిస్టియన్ రిపబ్లిక్ స్థాపించాడు. ఆ దేశానికి అతనిపేరే పెట్టారు. మరే దేశంలోను ఒక అంగుళం భూమికూడా తన కక్కరలేదని, తనభూమిని కొంచమైనా ఎవ్వరూ తీసుకోవీలు లేదని మారినస్ ప్రకటించాడు.

మారినస్ ప్రకటనకి ఇంతవరకూ ఏవిధమైన భంగపాటు కలగలేదు. నెపోలియన్ శాన్ మారినోకి కొంచెం భూమి రాసిస్తానంటే పుచ్చుకోలేదు.

ఈ రిపబ్లిక్ జనాభా సుమారు పధ్నాలుగు వేలమంది. ఈ చిన్న రిపబ్లిక్‌లో కూడా కమ్యూనిస్టులు తమ రాజ్యం స్థాపించాలని ప్రయత్నించినట్లు వింటాము. కాని ప్రజలు అతి ఉదాసీనంగా ఉండటంచేత ఈ ప్రయత్నానికి అర్థమే లేక పోయింది.

ఇక్కడ మూడు పెద్ద "కాసిల్" (Castle) లు వున్నాయి. ఇక్కడి ముఖ్య వ్యాపారం విలాసయాత్రికులకు స్టాంపులు, నాణేలు, బొమ్మలు మొదలయినవి అమ్మటం. అయినా జూదం కూడా ఒక విలాసంక్రింద ప్రభుత్వం గుర్తించక పోలేదు. సారాయం ఉత్పత్తి ఇక్కడ మరొక చిన్న పరిశ్రమ.

"టిటానో" కొండక్రింద "రిమినీ" సముద్ర తీరమున్నది. "రిమినీ"లో ప్రాచీనశిల్పాలు ఎన్నో వుండేవి. కొన్ని రెండవ ప్రపంచయుద్ధం బాంబులకు నశించాయి.

క్రీస్తు పూర్వం కట్టిన "ఆగస్టస్" వంతెన ఇక్కడి "మరచ్చియా" నదిమీద కట్టారు.

—రెంపిల్ మానింగ్ ★

# కాల్గేట్ వాడి నోటినుంచి దుర్వాసన రాకుండా చేసుకోండి
# రోజంతా దంతక్షయం రాకుండా కూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియచేయనంతటి శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చురుకైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు ఇష్టపడతారు. ఎందుకంటె చాలా సేపు ఉండే దాని పిప్పరమెంటు వంటి రుచి అంటె వారికి ప్రీతి!




కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే
- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును

మీకు పౌడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు ...ఒక చక్కని నెరజా వస్తుంది !

నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్నా కాల్గేట్ నే ఎక్కువ మంది వాడుతున్నారు

# (సి)నీతి చంద్రిక



# కొత్త శీర్షిక

## సుకుమార్

(గత సంచిక తరువాయి)

"ఏమిటండీ సలహాయిగారూ, ఇంతపని చేయించారూ ?" అన్నాడు ఫలానా.

"ఏమైంది ?" అన్నాడు సలహా—ఎటో చూస్తూ.

"నాటకం ఆడకండి—సినిమా తియ్యండి గాని! మీకు తెలీదా—మన నిర్మాతగారు ఎట్లా వెళ్ళిపోయిందీమా ?"

"తెలిస్తే ? అతనిష్టం. అతను సినిమా మానుకున్నాడు. మన మనవరం చెప్పటానికి సొంత టానికీ—యూ సీ—"

"ఐ సీ—" అన్నాడు ఫలానా విరాగ్గా.

"మీరు వారికి సరిగా సలహా యిచ్చుండాల్సి గదా—ఐనా, వస్తాను చేస్తాను అని చెప్పి ఇంతలా మౌనం చేసి వెళ్ళిపోతే ...." అన్నాను నేను.

"అరెరె! వాట్ డూ యూ మీన్, ఇటీజ్ ...."

"తెలుగులోకి డబ్ చేదురూ, చస్తున్నాం" అన్నాడు ఫలానా.

"అబ్బాయ్ ఫలానా— ఇందులో ఇంత వర్రీ కావటానికి ఏముందో నాకు అర్థం కావటంలేదు. ఈ ప్రకారంగా సినిమాలు తీస్తామని మనుషులు రావటం, బోర్డులు కట్టటం, కొంత హంగు చెయ్యటం—ఇదంతా ఈ 'సీమ' లో మామూలే గదా ! ఇంకా నయం, మనవాడు ఇంకా బోర్డు కొట్టలేదు. అందుకు సంతోషించండి" అన్నాడు సలహా—వెళ్ళిపోతూ.

"స్వామి మా కేదన్నా సలహా యివ్వండి" అన్నాడు ఫలానా.

సలహా వినిపించుకోలేదు, అట్లాగే పోతున్నాడు.

"ఓ సినీతి కథేనా సెలవివ్వకుండా వెళ్తున్నారు—" అన్నాడు మళ్ళీ.

"పోనీ వూరుకోవోయ్" అన్నాను నేను.

"దొంగ చచ్చినోడు. వీడే చేసిఉంటాడులెండి గురూ ! అసలు యిట్లాంటివాళ్ళు ఫీల్డులో చాలా మంది ఉన్నారు. వాళ్ళు పోతేనేగాని—ఫీల్డు బాగుపడదు !" అన్నాడు—ఆవేశంగా ఫలానా.

"అనవసరంగా నోరు పారేసుకోకు. సలహా చెప్పినట్టు—సలహా మాత్రం ఏం చేస్తాడు ? అతనూ మనలాగానే అవస్థపడుతున్నాడేమో" అన్నాను నేను.

"ఇటువంటివాళ్ళు ఏమీ అవస్థపడరు గురూ—డబ్బుపెట్టిన వాళ్ళని మధ్యలో ఇరికించి—తమాషా చూస్తారు. మీకో కథ చెప్తాను వినండి. ఆమధ్య—ఒక డబ్బున్నాయన సినిమా తియ్యటానికి వచ్చాడు. వాళ్ళకేం తెలుస్తుంది ? మన సలహాలాంటి మనిషి ఒకడు దొరికాడు. వాడి ఆధారంగా చిత్రనిర్మాణ యత్నం కొనసాగింది. అసలాయన ఈ మనిషికి డబ్బివ్వటమే వన్నమాట. ఇతనేం కావాలన్నా ఏం చెయ్యాలన్నా అతను చేసేవాడు. ఈ మనిషి తన యిష్టం అందర్నీ పెట్టాడు. తానే పెద్ద ప్రొడ్యూసర్లా పోజు కొడుతూ, కార్లమీద తిరుగుతూ ఇతరుల ధనంమీద సౌఖ్యాలు పొందసాగాడు. గులాంత దగ్గర్నుంచి అందరూ ఇతనికే సలాంలు కొట్టేవారు. ఈవిధంగా పంచరిస్తూ, అతను చాలా 'డబ్బు' కొట్టేశాడు. ఆ డబ్బు పెట్టిన మనిషి పాపం—ఇక్కడ ఉండేవాడే కాదు. స్టాఫ్‌కు ఇంత ఇవ్వాలి, అంత ఇవ్వాలి అని చెబుతూ, తాను మిగుల్చుకొంటూ ఉండేవాడు. చివరకు ఏముందో తెలుసా గురూ! చిత్రం విడుదలై—నాలుగయిదు వారాలు కూడా పోలేదు. నిర్మాత చాలా నష్టపోయాడు. కానీ, కానీ కూడా పెట్టుబడి పెట్టకుండా—కార్లమీదా, వోట్లమీదా తిరిగి, 'పోజు' కొట్టి అధికారం చెలాయించిన ఈ మనిషి లాభం సంపాయించాడు. ఆ డబ్బుపెట్టి స్వంతంగా చిత్రం తీస్తున్నాడని వింటున్నాను. వింటున్నారా గురూ ! ఎంత అన్యాయమో, ఎంత

-53 వ పేజీ చూడండి



"ఆత్మబంధువు"లో రామారావు

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది!



# ప్రపంచప్రముఖులు-13

క్వామె ఎన్‌క్రుమా అమెరికాలో చదువుకుంటున్న కాలంలో ఒక హోటల దాహంవేసి ఒక తెల్లజాతి మనిషిని మంచినీళ్ళకోసం అడిగాడు. అతను ఒక పాత్రను చూపించి దాహం తీర్చుకోమని చెప్పాడు. ఆ పాత్ర ఉమ్మివేయటానికి వాడేది. ఇంత దారుణమయిన సంఘటనకూడా ఎన్‌క్రుమా సౌమ్యప్రవర్తనను మార్చలేదు. అసలు ఈ సంఘటనగురించి తనే చెప్పుకున్నారు. ఘనా మొదటి ప్రధానమంత్రిగా ఎన్నిక అయిన క్వామె ఎన్‌క్రుమా అందరిపట్లా సరళంగానే ప్రవర్తిస్తూవచ్చారు. తనను జెయిలులో పెట్టిన బ్రిటిషు అధికారులతో కూడా చాలా స్నేహభావంతో మెలగేవారు. అటువంటి వ్యక్తి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత క్రమంగా మారిపోవటం విచారించతగిన విషయం. ప్రతిపక్షంవారిలో చాలామంది నేడు కారాగృహంలో ఉన్నారు. ఘనాకి పూర్తిగా ప్రజాస్వామ్యపద్ధతులు పనికిరావనే మిషతో ప్రతిపక్షాన్ని అణచివేసే ధోరణి స్పష్టంగా కనిపిస్తుంది. దీనికితోడు, ఎన్‌క్రుమాని వ్యక్తిగతంగా పూజించటాలు కూడా కనిపిస్తున్నాయి. ఆయన చిరంజీవి అనీ, దైవసమానుడనీ పాఠశాలలలో చెప్తున్నట్లు తెలుస్తుంది. ఈ ప్రచారం మితిమీరడం చూడలేక కొందరు ఆంగ్లికన్ క్రైస్తవ మతాచార్యులు ఘనాలోని ఒకచోట దానిని ఖండింపజేశారు, వెంటనే ప్రభుత్వం అతని మీద చర్య తీసుకోవటానికి సిద్ధమయింది. ఘనాపట్ల ఎక్కువ సానుభూతి చూపుతున్నవారికి సైతం ఈ చర్యలు నచ్చలేదు. స్వాతంత్ర్యదేశం కాకముందు అక్కడి మిషనరీ ఒక అతను నల్లవారు హీనజాతివారు అని ప్రచారం చేసినా బ్రిటిషు ప్రభుత్వం చర్య తీసుకోనలేదనే విషయం ఈ చర్యను సమర్థించదని వీరు ఒప్పుకుంటున్నారు. ఎన్‌క్రుమాను హత్య చేయాలని ప్రయత్నిస్తున్నారనీ, అతనినిగురించి చేసే ప్రచారం ఈ ప్రయత్నాల 'మహిమ'ను అరికట్టటానికేనని కూడా ఎన్‌క్రుమా పక్షంవారు వాదిస్తున్నారు!

ఘనాలో సోషలిజం స్థాపించి, ఆఫ్రికాలో ఒక పెద్ద నల్లదేశాలసమాఖ్య ఏర్పరచాలని ఎన్‌క్రుమా ఆశయం. కాని నియంతృత్వ పోకడలు చూపిస్తున్న ఎన్‌క్రుమా నాయకత్వం క్రింద ఈ ఆశయం ఎంతవరకు నెరవేరుతుందో చెప్పడం కష్టం. ★



## మీ జనరల్ నాలెడ్జి ఎంత?

[ఈ క్రింది ప్రశ్నలకు జవాబులు వరుసగా లేకుండా ఏదో ఒక వరుసలో చేశాము. సరియైన వరుస తలక్రిందులుగా ఇదే పేజీలో ఉంది.]

| | |
|---|---|
| 1. భారత ప్రధాని ఎవరు? | (a) అమెరికా |
| 2. కృష్ణాజిల్లా ప్రక్కగా పారే నది పేరేమిటి? | (b) రష్యా |
| 3. మద్రాసురాష్ట్రం రాజధాని ఏది? | (c) బ్రిటన్ |
| 4. ఆంధ్రప్రదేశ్ లో మాట్లాడేభాష ఏది? | (d) ఆంధ్రభాష |
| 5. ఎలిజబెత్ ఏ దేశానికి రాణి? | (e) మద్రాసు రాష్ట్రం |
| 6. క్రుశ్చేవ్ ది ఏ దేశం? | (f) కృష్ణానది |
| 7. అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఏ ఖండంలో ఉన్నాయి? | (g) నెహ్రూ |

—జ్ఞానేంద్ర (విశాఖపట్నం)



ప్రశ్నలకి జవాబులు

g, f, e, d, c, b, a, సరియైన వరుస. అన్నీ సరిగా వస్తే 100 మార్కులు. ఒకొక్క తప్పుజవాబుకీ 100/7 మార్కులు తగ్గించుకోవచ్చు. కాని ఉద్దేశం మీకే కాబట్టి కొంచెం ఎక్కువ వేసుకున్నా అడిగేవారుండరు.

### కొత్త కవిత్వం!

ఇదంతా ఒక కవిత్వం
కవిత చమత్కృత్యం
వినుంటున్నలతో నిమిత్తంలేదు
పేరుగాంచిన కవుల ప్రసక్తేలేదు.
కనకచరిత్ర, మనుచరిత్ర
అదంతా ఒక పాతచరిత్ర
మేము వ్రాసేదంత యథార్థవాదం
మీరు చదివితే మా కదే ఆనందం
గద్యపద్యాల గొడవలెందుకు?
మేము రాసేవన్నీ గేయాలు
అవన్నీ జీవచ్ఛాయలు
రోజుకు రెండు రాసేస్తాం
రోజుకొకటి ప్రచురిస్తాం
మాటకోపేరు మార్చేస్తాం
మార్పులోని మజా చూపిస్తాం
ఈ రోజున 'మిత్రయాత్ర' అనిస్తే—
రేపుకు మరోపేరు 'మిత్రమాత్ర' అనిస్తే.....
కథలు వ్రాయాలంటే కాలంపడుతుంది.
పద్యం వ్రాయాలంటే ప్రాసఉంటుంది
గద్యం వ్రాయాలంటే గొడవగా ఉంటుంది
నాటిక ప్రారంభిస్తే నవలవుతుంది
గేయంఅంటే మిత్రుత్వంతో అభిప్రాయం.
అది వ్రాయాలంటే కావాలి అభిప్రాయం
చదవండంత్లో పడిఉంటానంటుంది.
మీ పేరున్నా, పేరని మారుతుంది
మీఅందరు చదవాలని ప్రార్థిస్తాం
లేకున్న చదివినట్లుగా భావిస్తాం.......

కె. వేంకటేశ్వరరావు (హనుమకొండ)

* * *

ప్రశ్న: ఒట్టో ! ఓ రేయ్ ! మీ అమ్మమాట మీ నాన్న వింటాడా ? లేక మీ నాన్నమాట మీ అమ్మ వింటుందా ?

జవాబు: ఇద్దరి మాటా వీధిలో వాళ్ళు వింటారు.

వి. వి. వి. లీల, (రామచంద్రపురం)

* * *

## కలియుగ విదుర!

పురుషుండు రెండు తెరగుల
ధర లౌకికు డనగ బరగు తా నెయ్యదలం
దొరకినచో శిఖవట్టుట,
దొరకనిచో పదములంట దొరకొను కలనన్.

పూటకు గతి లేకున్నను
మాటలతో స్వీయ మానమర్యాదల కే
లోటును రానీకుండగ
దాటుచొ కలియుగమునందు దర్పంబధిపా!

తన గుట్టు బయలుపడనీక
తన పొరుగుల గుట్టుమట్టు తా నెరుగును, నరే-
వినియోగ పరమకోసగల
జనుడే కలియుగమునందు చతురుడు నృపతీ!

ధనహీనుని దెగడుటయును,
ధనవంతుని బొగడి మెప్పుదల బొందుట
యున్,
పని గడుపుకొనుట, కలియుగ
మున జనులకు సహజమయ్యె, భూపతి వింటే!

తనకడ రూకలు లేవే
యని గుందక, నేర్పు మెరయ నన్యుల
సొమ్ముల్ గొని లక్షలు నార్జించెడి
జనుడే కలియుగమునం దసాధ్యుడు నృపతీ!

తనసొమ్ము పరుల సొమ్మని
తన మనమున భేదబుద్ధి తలపక, చే జి
క్కిన ధన మెక్కుడిదై నను
తనదిగ భావించువాడు ధన్యుడు నృపతీ!

తను దాను బొగడుకొనమియు,
తన కీర్తిని బొగడువారి తెగడుటయునుం
తను మరొకని బొగడుటయును
విను, నరవర, కలియుగాన వెంగలి పను లౌ!

పి. యస్. రంగారావు, (భద్రాచలం)



## పరవళ్లు!

పడుతున్నయ్ రైళ్లు
గడుస్తున్నయ్ మైళ్లు!
పెరుగుతున్నయ్ ఫైళ్లు
తిరుగుతున్నయ్ కళ్లు!
నముల్తున్నయ్ పళ్లు
అయిపోతున్నయ్ తిళ్లు.
గగుర్పొడిచింది ఒళ్లు
పులిసిపోయినయ్ పళ్లు!
ఈ దారిన మాత్రం వెళ్లు
మిగిలినవన్నీ ముళ్లు!
చూపన ఒక్కటి చెళ్లు?
అన్నది ఉడుముపిల్లి
ఇదియే నేటి కవిత్వం
గర్వించే మానవ తత్వం!!

"సౌదామిని"

* * *

## కథా పరిభాషా కోశం

నగ్నసత్యం—అందరికీ తెలిసింది
విషాదగాథ—విసుగుపుట్టించే కథ
రోదించింది—ఏడిచింది
ఆరాధన—పిచ్చి, (సందర్భంపట్టి)
హృదయంలో స్థానం — వైద్య
శాస్త్రం ఇంకా కనుక్కోని
రహస్యాలలో ఒకటి.
కళాపిపాసి — సినిమా పోస్టర్లు
చూసేవాడు.
విచలిత—చలి బాగా వేస్తున్నా
కప్పుకోలేని స్థితిలోని వ్యక్తి (అని
మా సినిమాటువు రచయిత అభి
ప్రాయం.)

కె. శాస్త్రిరాజ్యలక్ష్మణశర్మ.

★



"మరీ అంత గొంతెత్తి పాడక్కర్లేదమ్మా!"

# ఉచితమైన అత్యాకర్షకమైన

## స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్ర సామానులు —మీరు కోరునవన్నీ గలవు.

అందచందాల బహుమానాలు మిమ్మల్ని తప్పక మెప్పించగలవు. ఈ బహుమాన కూపనులను ఓ.కె. తయారీ వస్తువులనుండి చేర్చిపెట్టండి.




మీరు కొను ఈ క్రింది ప్రతి ఓ.కే. తయారీ వస్తువుతోనున్న బహుమాన కూపనులను చేర్చిపెట్ట ప్రారంభించండి.

- ఓ.కే. వనస్పతి • ఓ.కే. డబుల్ రిఫైన్డ్ ఆయిల్
- గోల్డెన్ సలడ్ ఆయిల్ • ఓ.కే. చందన సబ్బు
- ఓ.కే. ఓరియంటల్ రోజ్ సబ్బు • ఓ.కే. నీమ్ సబ్బు
- మియోకో సబ్బు • సోప్‌చిప్సు

మరిన్ని ఆ మీ కూపనులకు మారుగా అత్యాకర్షణీయమైనట్టి స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలను — మీకు ఇష్టమైన పరిమాణ ప్రమాణాలలో — మీకు అతి సమీపమునగల ఓ.కే. వ్యాపారి వద్దనుండి పొందండి.

ఈ ప్రత్యేక బహుమానయోజనం గురించిన విశేష వివరాలు గల పత్రిక కోల్దరుగుకించి మీ ఓ.కే. వ్యాపారిని అడిగి పొందండి.







తయారుచేసినవారు:

**ది ఈస్ట్ ఏషియాటిక్ కం. (ఇండియా) ప్రైవేట్ లిడ్., మదరాసు-1**

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది.**



# పరిశుభ్రత

కమ్యూనిస్టు చైనాలో ఏ విషయంలో ప్రగతి సాధించినా, లేకపోయినా పరిశుభ్రత విషయంలో ముఖ్యంగా ఉమ్ములు వేయకుండా ఉండటంలో— నమ్మలేనంతగా అభివృద్ధి సాధించారుట. అయితే, పరిశుభ్రతకీ, కమ్యూనిజానికీ ఏవిధమైన అవినాభావ సంబంధమూ లేదు. కావలసినదల్లా పట్టుదల, తీవ్రకృషి. పరిశుభ్రతని గురించి మనం త్వరలో శ్రద్ధ తీసుకుంటేతప్ప, ప్రస్తుత పరిస్థితులు శాశ్వతంగా నిలిచిపోయే ప్రమాదమున్నది.

ముఖ్యంగా ఇదే పద్ధతి రైల్వేస్టేషను, మార్కెట్లవంటి పబ్లిక్ స్థలాల శుభ్రత విషయంలో కూడా అవలంబించవచ్చు. మార్కెట్లను కంట్రాక్టుకి తీసుకునేవ్యక్తి, మార్కెట్‌లోపల, బయట పరిశుభ్రతకి బాధ్యుడనీ, ఆ పరిసరాలు పరిశుభ్రంగా లేనిపక్షంలో కంట్రాక్టు రద్దు చేయబడుతుందనీ, ఇంకా ఇటువంటి నియమాలూ ఏర్పాటు చేయాలి. ఇవన్నీ అమలు జరిపేందుకు వెనుక కావలసినంత రాజకీయాలు ఉంటాయనేది నాకు తెలియకపోలేదు. కానీ, ప్రజాస్వామ్యంలో ప్రతి వ్యక్తీ తన హక్కులనీ, బాధ్యతలనీ సద్వినియోగ పరచుకుంటే సాధించలేనిది ఏదీ వుండదు. మార్పు రేపే రాకపోవచ్చు. కొన్నాళ్ళ తరువాతైనా వచ్చితీరుతుంది.

మన పట్టణాలలో మరొక అశుచికేంద్రం పబ్లిక్ పాయిఖానా. ఇక్కడ మరుగుతప్ప మరే శాక ర్యమూ ఉండదు. కనీసం నీళ్ళయినా ఉండవు. ఇటువంటిచోట్లను అలకాజనం, ముష్టివాళ్ళు ధారాళంగా వాడుకుని వెళ్ళిపోతారు. ఆ దుర్గంధం రోడ్డుమీద, చుట్టుప్రక్కల వ్యాపించి దుర్భరంగాఉంటుంది. దీనిని అరికట్టేందుకు రోడ్లమీద ఎక్కడపడితే అక్కడ ఈ పాయిఖానాలు కట్టటం మానివేయాలి. పేదసాదల ఉపయోగంకోసం వాళ్ళు నివసించే ప్రదేశాలదగ్గర మరుగుదొడ్లు కట్టి, అక్కడ 24 గంటలూ నీటి వసతి ఏర్పాటు చేయాలి. మంచినీటి పంపులతో కలపటం కష్టమైతే నూతులలోనుంచి పంపులు ఏర్పాటు చేయాలి. ముఖ్యమైన రోడ్లమీద పబ్లిక్ మరుగుదొడ్లు కట్టటం పేదవాళ్ళు, ముష్టివాళ్ళు, పని లేకుండా రోడ్లమీద తిరిగేవాళ్ళు అక్కడ స్థిరనివాసం చేసేందుకు వసతి కల్పించటమే అవుతుంది.

తరువాత పౌరులు శ్రద్ధ తీసుకోవలసినది మురుగుకాల్వలను గురించి. ఈ విషయంలో ప్రజలు స్వయంగా చేసేది ఎక్కువలేకపోవచ్చు. కాని, పురపాలక సంఘాలను ఒత్తిడిచేసి, అండర్ గ్రౌండ్ డ్రైనేజికి శక్తిలేకపోతే, కనీసం ఊరంతా సిమెంటు కాల్వలైనా కట్టేట్లు చూడాలి. ఈ విషయంలో నిత్యం వేలాది యాత్రికులు వచ్చిపోయే పెద్ద తిరుపతి, అంతకన్న ఎంతో పెద్ద ఊళ్ళయిన గుంటూరు విజయవాడలకంటే ఎంతో శుభ్రంగా ఉంటుంది. ఊరంతా తారురోడ్లు, చిన్న సందులైతే సిమెంటు చేసేఉంటాయి. ప్రతిరోడ్డుప్రక్క కాలువలు సిమెంటు చేసివుంటాయి. ప్రతిరోజూ రెండుసార్లు కాలువలు శుభ్రం చేస్తారు. ఈ ఏర్పాటే లేకపోతే దేశం నలుమూలలనుంచీ యాత్రికులు వచ్చిపోయే ఆ పట్టణం నానా రోగాలకీ నిలయంగా ఉండేది. "ఆంధ్రా, పారిస్" అనుకునే విజయవాడ, (లేక తెనాలియా?) అంతే ప్రాముఖ్యం కల గుంటూరువంటిచోట్ల మురుగు కాల్వ నుంచి వచ్చే దుర్గంధం, దోమలు వగైరా ఎరుగని తెలుగువాళ్ళుండరు. ఇవేకాక, ఆ ఊళ్ళలో పందులని వెనుక వేసుకు వచ్చేవారు కూడా లేకపోలేదు. "అవే లేకపోతే......" అంటూ మొదలుపెట్టి, పాకీవాళ్ళ బదులు పందులు ఎంత సహాయం చేస్తాయో వర్ణిస్తారు. కానీ, అసలు పందుల అవసరమే లేకుండా చేసుకోవచ్చుని వీరికి ఎందుకు తట్టదో నాకు తెలియదు.

బహుశా మన పల్లెలస్థితి బస్తీల అంత అధ్వాన్నంగా లేదు. పెద్ద పంచాయతీలలో అప్పుడప్పుడు వీధులు ఊడ్చే ఏర్పాటుఉన్నా, చాలా పల్లెలలో ఈ ఏర్పాట్లులేవు. అందువలన ఇళ్ళు, వాకిలి ఊడ్చిన పోగు దొడ్లో ఒక ప్రక్కగా నిలువచేసి, ఏడాదికి ఒకసారిగాని, రెండుసార్లుగాని పొలాలలో ఎరువుగా వాడతారు. ఈ పద్ధతివలన వీధులు శుభ్రంగావున్నా, మరొక అనర్థకం ఉన్నది. నెలలతరబడి ఈ పెంట పోగు ఇంటి పెరడులో నిలవఉండటం ఆరోగ్యం కాదు. అందువలన కనీసం నెలకి 1, 2 సార్లు ఈ పోగునంతా పొలంలోనే ఒక ప్రక్క ఛేర్చితే మంచిది. పొలాలులేనివారి సౌకర్యార్థం పంచాయతీలు ఊరి బయట ఒక స్థలం మేర్పరచి, వారానికి ఒకసారి ఈ పోగుని అక్కడికిచేర్చే ఏర్పాటుచేసి, అందుకయే ఖర్చుని నెలకొకసారిగాని, ఇంకా అలస్యంగాగాని పెంటపోగుని వేలంవేసి రాబట్టుకోవచ్చు.

పల్లెటూళ్ళలో మార్చుకోవలసిన మరో విషయం మల విసర్జనకి నిర్ణీతమైన స్థలం అంటూ లేకపోవటం. ఈనాటికీ చాలామంది తెల్లవారితే ఊరి బయటకీ, పొలాలలోకీ రోడ్లు, రైలుకట్టలు, తోటలకీ బయలుదేరుతారు కాలకృత్యాలు తీర్చుకునేందుకు. వెనుకటి రోజులలో ఇది సభ్యతో, అసభ్యతో ప్రస్తుతం చర్చనీయాంశంకాదు. కానీ, ఈనాటి పరిస్థితులలో ఈ పద్ధతి చాలా అనాగరకంగానే ఉంటుంది. బ్లాక్ డెవలప్‌మెంట్‌వారు, ఊరిపెద్దలు సహకరించి, ప్రతిఇంట సెప్టిక్ మరుగుదొడ్లు కట్టించుకునే ఏర్పాట్లుచేయుటం అత్యవసరం. ఇందు [illegible] కొన్ని బ్లాకు, కమ్యూనిటీ డెవలప్‌మెంట్‌వాళ్ళు ఉచితంగా ఇస్తామన్నా, పల్లెలలో ప్రజలు, పెద్దలు సహకరించటంలేదని వారంటారు. పాత పద్ధతులు మార్చుకుని, వాటి స్థానంలో ఆరోగ్యవంతమైన పద్ధతులు అలవరచుకోవటం పల్లెలలో ఎంతో అవసరం. ఈ విధమైన మార్పులకి అవసరమైన ప్రచారం కూడా విరివిగా సాగాలి.

కొన్నిగ్రామాలలో ఊరంతటికీ, ఒకటే మంచి నీళ్ళ బావి ఉంటుంది. చాలామంది అక్కడే స్నానాలు కూడా చేస్తారు. ఈ బావులకి చుట్టూ సిమెంటుగట్టుగానీ, చప్టాగానీ ఉండదు. స్నానాలు చేసిన నీరు మళ్ళీ మట్టి ఒరలగుండా లోనికి పోతుంటుంది. ఈ బావులకి సిమెంటుతో గట్టు కట్టటం, అక్కడ స్నానాలు చేయకుండా కట్టుదిట్టం చేయుటం ప్రజారోగ్యానికి కనీసావసరాలు.

ఇలా వ్రాస్తూపోతే అనేక విషయాలు ఉంటూనే ఉంటాయి. అన్నింటిని గురించీ వ్రాయడం సాధ్యం కాదు. పరిశుభ్రతయొక్క అవశ్యకతని గుర్తిస్తే, ఆచరణ కష్టంకాదు. చాలావరకూ మన ఇళ్ళలోపలి భాగాలు శుభ్రంగానే ఉండవచ్చు. కానీ పరిసరాలు మలినంగా ఉన్నంతవరకూ ఇళ్ళు ఎంత శుభ్రంగా ఉన్నా ప్రయోజనంలేదు.

స్వదేశీయులుగానీ, విదేశీయులుగానీ ఏప్రదేశాన్నైనా చూడముచ్చటగాఉండాలంటే లోపలిపరిశుభ్రత ఎంత ముఖ్యమో బయటి పరిశుభ్రత అంత ముఖ్యం. ఇంతేకాక, ప్రజల ఆరోగ్యం దృష్ట్యాకానీ, సివిక్‌సెన్సు దృష్ట్యానైనాకానీ ఊరి పరిశుభ్రత తక్షణాచర్య తీసుకోవలసిన ముఖ్య విషయం. ఈ విషయాన్ని ఊరిలో ప్రజల దృష్టికి తీసుకురావటం, దాని ప్రాముఖ్యతని వారికి నచ్చచెప్పటం, స్త్రీలు చేయవలసిన పనే. పురుషులకి అంత తీరుబ్బా, తీరికా ఉండకపోవచ్చు. మన మహిళా సంఘాలు పిచ్చాపాటీకబుర్లతోటీ, ఆశమ్మ, బోశమ్మ కబుర్లతోటీ కాలక్షేపం చేయక, ఇటువంటి నిర్మాణాత్మక కార్యక్రమాలలో సహాయపడితే వాటి ఉనికిని సార్థకపరుచుకున్నట్లవుతుంది.

—మతుకుమల్లి. సుశీల.



# మనోబాధ

భాగ్యవతి.కె

"ఎంత సేపైందండీ, వచ్చి... !" అంటూ రమ, హాస్పిటల్ నుంచి వచ్చి, కోటైనా తియ్యకుండా కుర్చీలో కూర్చుని పరధ్యానంగా ఎక్కడికో చూస్తూ ఆలోచిస్తున్న శేఖర్ దగ్గరకు వచ్చింది.

"ఇప్పుడే రమా...ఇప్పుడే వచ్చాను"

"ఉండండి కాఫీ తెస్తా..." అంటూ వెళ్ళి రమ కాఫీ పట్టుకొచ్చి టేబిలుపై పెట్టి, శేఖర్ కోటు తీస్తూ...

"ఏమిటండీ! అలా ఉన్నారు? తలనొప్పిగా ఉందా...?" అని కోటు స్టాండుకు తగిలించివచ్చి శేఖర్‌కు ఎదురుగా కూర్చుంది.

కాఫీ తాగుతూ శేఖర్ "ఏం లేదు రమా..." అన్నారు.

"అదేమిటండీ అంత సీరస్‌గా ఉన్నారు...ఏం లేదంటారేం? నాతో చెప్పకూడదా ఏం?" అంది లాలనగా.

—4/- పేజీ చూడండి.



సినిమాకథ :

# కింగ్ ఆఫ్ కింగ్స్

## జరిగిన కథ

రోమన్ సైనికులు జెరూసలేంను ఆక్రమించినకాలంలో జోసెఫ్, అతడి భార్య మేరి బెతలెహాం చేరారు. మేరీకి గుర్రాల శాలలో జీసస్ జన్మిస్తాడు. ఆ శిశువును సంహరించేందుకు జెరూసలేం రాజు హీరాడ్ ప్రయత్నించగా జోసెఫ్ మేరీలు ఈజిప్టుకు పారిపోయి, అంటిపస్ రాజ్యానికి వచ్చాక జెరూసలెంకు తిరిగివస్తారు.

రోమన్‌లను విప్లవవాదు లెదిర్చి ఓడిపోతారు. ఆత్మప్రబోధం వల్ల జీసస్ ఎడారి ప్రాంతాలలో గడిపి వస్తాడు. సలోమి, హీరాడియాలు తమ పాపాలను ఏకరువుపెడుతున్న బాప్టిస్టు జాన్ తల తీయిస్తారు. జీసస్ అనేక అద్భుత కృత్యాలు చేస్తాడు. గెలీలీ కొండలలో జీసస్ చేసిన ఉపన్యాసం చాలామందిని నిరాశతో నింపుతుంది. కాబట్ పండుగనాడు నగరంలో రోమన్‌లపై దెబ్బతీయాలని విప్లవకారుడు బరబ్బాస్ నిశ్చయించుకుని ఓడిపోతాడు. జూడాస్ మూలంవల్ల జీసస్‌ను రోమనులు బంధించి విచారణ జరుపుతారు.



సిలువముందు కూర్చున్న క్లాడియాకు 'అతడే క్రీస్తు' అని లూసియస్ అనటం విన్పించింది.

ఉన్నతమతాధికారి కైఫాస్ అధ్యక్షత, తన వృద్ధ ఆలయఅధికారి మండలి తీర్పు తర్వాత జూడియా గవర్నర్ పిలేట్, జీసస్‌ను విచారింపబూనుకున్నాడు. అది ఇప్పుడు విచారణకు వచ్చింది. ఆంటోనియా దుర్గం రోమన్ సైనికదళాలరక్షణలో అతిభద్రంగా వుంది. ఆ విశాలమైన గదిలో రోమన్ గవర్నర్ పిలేట్, లూసియస్, నిందితుడు జీసస్, ఆరోపక నిందితుల ప్రశ్నోత్తరాలు వ్రాసుకునే వ్రాయసగాళ్లు ముగ్గురుమాత్రం వున్నారు. మతవిశ్వాసవిరుద్ధ [illegible] నేరాలు. ఋజువైతే శిక్ష మరణం.

బందీగా నిలబడిన జీసస్ ముఖంలో ఎలాంటి సంచలనము లేదు. అతి ప్రశాంతంగా వుంది. ఆ గదిలోవున్న వాతావరణానికీ అతనికి ఎలాంటి సంబంధం లేనట్లుగానే వున్నాడు.

వ్రాయసకారులు ఇచ్చిన పత్రాలను పరిశీలించి పిలేట్ "మత విశ్వాస విరుద్ధ ప్రవర్తన - అనే నేరంతో నాకు సంబంధం లేదు. రాజద్రోహమే - రోమన్‌ల ప్రభుత్వాన్ని పడగొట్టేందుకు కుట్ర పన్నాట మనేదే విచారించాల్సిన నేరం. ఋజువైతే కొరడాలతో కొట్టి సిలువవేసి చంపుతారు తెలుసా జీసస్?" అన్నాడు.

జీసస్ అలాగే చూస్తూ నిలబడిపోయాడు. ఏం సమాధానం చెప్పలేదు. పిలేట్ జీసస్ నుద్దేశించి ఎదురుగా "నిన్ను నువ్వు సమర్థించుకోటానికి ఒక్క అవకాశం ఇస్తున్నా....." అప్పటికీ జీసస్ మాట్లాడలేదు. ఈ లోగా వ్రాయసగాళ్లు ఏదో వ్రాయబోతుండటం గమనించి పిలేట్ "ఈ నిందితుని తరఫున వాదించేందుకు లూసియస్ కాంటానస్‌ను .." ఈ మాట వింటూనే 'నేనా, నేనా' అంటూ లూసియస్ అభ్యంతరం తెల్పాడు. దానికి పాంటియస్ "లోగడ కూడా నీవు ఇతన్ని సమర్థిస్తూనే వున్నావుగా, పైగా అతనిచర్యలు చూశావు, మాటలు విన్నావుకదా! ఇంకేం అతన్ని సమర్థించు." అన్నాడు.

ఆక్షణంనుంచి లూసియస్ ధోరణిమారింది. తాను రోమను సైనికుణ్ణన్న భావానికి బదులు ఒక

—43 వ పేజీ చూడండి

ప్రేమ కానుక

13

సత్యమూర్తి


















దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**7-9-1962 శుక్రవారము మొదలు**
**13-9-1962 గురువారము వరకు**

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం గ్రహబలం బాగున్నది. ధనవిషయంలో ఏవిధమైన అభ్యంతరాలు ఉండవు. అధికారులతో చాలా జాగ్రత్తగా మాట్లాడగలుగుతారు. వృత్తి వ్యాపార విషయాలలో ఇంతకుముందు జరిగున్న పొరపాట్లను గుర్తించుకుని మీ పనులను సాగించుకొంటారు. పిల్లల శుభ సంతోష కార్యాలకై ఖర్చులు పెరగవచ్చు. వ్యవహారాలలో సాధారణమైన అవకతవకలు కనుపించవచ్చు. వాటినిగురించి మీరు అంతగా పట్టించుకోనవలసిన అవసరం ఉండదు. రాజకీయాలలో అభ్యంతరాలను ఎదుర్కొనవలసిన సమయం. పట్టుదలలవల్ల శ్రమ కలుగుతుంది. వృత్తిలో స్వల్పశ్రమతో అత్యధిక లాభాన్ని పొందగల అవకాశాలున్నవి. 7, 8 తేదులలో వృథా ప్రసంగాలు, పనులలో విముగుదల.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీరు సాగించే ప్రతి పనీ పదిమందికీ సంతృప్తి కలగగల స్థితిలో ఉంటుంది. ఆదాయాన్ని మించిన ఖర్చులు చేస్తారు. ఒకటి రెండు సందర్భాలలో అకస్మాత్తుగా కలహాలు రావచ్చు. ముఖ్యంగా వృత్తిలో మీ స్థానంయొక్క ఆధిక్యత పెరగగల సమయం. ఇతరులకు మధ్యవర్తిత్వం నిర్వహించవలసిన అవసరం ఏర్పడుతుంది. ఏపని చేసినా మనశ్శాంతి, సుఖము లభిస్తవి. విద్యార్థులకు బుద్ధి వికసించ తగిన సమయం. గ్రహణశక్తి బాగుంటుంది. పాత స్నేహితులను కలుసుకొంటారు. వారం రెండవ భాగంలో దూరపు ప్రయాణం సాగించవలసి రావచ్చు. 8, 9 తేదులలో వృత్తిలో అనుకూలత, ధనవ్యయము, బాహ్య ఆడంబరము.

> **గ్రహస్థితి**
>
> మిథునంలో అంగారకుడు, కర్కాటకంలో రాహువు, సింహంలో సూర్యుడు, కన్యలో బుధుడు, తులలో శుక్రుడు, మకరంలో శని, రాహువులు, కుంభంలో గురువు, వృశ్చిక, ధనుర్మకర కుంభాలలో చంద్రుడు.

* * *

### మిథునం :

(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఎంత జాగ్రత్తగా ఉన్నా ప్రక్కనే తప్పులు వెతికేవారు ఉండటంవల్ల మనశ్శాంతి తగ్గుతుంది. సాధ్యమైనంతవరకు వర్తుకునిపోవటంవల్ల మీ పనులను చక్కబెట్టుకోగలుగుతారు. మీ ఆరోగ్యం బాగుంటుంది. ఎదురుచూస్తున్న వార్తలు లాభకరంగా వస్తవి. దైవకార్యాలు ప్రశాంతంగా జరుగుతవి. వ్యవహారరంగంలో సమయానికి తగిన ఆలోచన చేయగలుగుతారు. ఈ సమయంలో ఒక కార్యం నిమిత్తం చేసిన ప్రయత్నం మరొక కార్యం నిమిత్తం వినియోగించవలసి వస్తుంది. వృత్తి ఉద్యోగాలలో కార్యభారం పెరుగుతుంది. కుటుంబంలో గతవారంకన్నా ప్రశాంతంగా ఉంటుంది. నిరాడంబరంగా మీ సమస్యలను తీర్చుకోగలుగుతారు. 12, 13 లలో ధనప్రాప్తి, వృత్తిలో క్రొత్తవారితో స్నేహం.

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)

మీరు ధైర్యంతో ముందుకు పోతున్న సమయంలో అలవిరళంగా ఆటంకాలు వస్తుంటవి. అనవసరమైన పట్టుదలలు పెరగగల అవకాశాలున్నవి. ఈ సమయంలో ఆర్థికచిక్కులు తొలగిపోతవి. బంధువర్గంలో గౌరవం బాగుంటుంది. నిరుత్సాహం అనేది లేదు. బుద్ధిబలంతో విజయం సాధించగలుగుతారు. కొన్ని సమయాలలో మీ బాధ్యతలను ఇతరులమీద విడచి మీరు మనోకభారం వహించవలసివస్తుంది. పిల్లల ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. ధనాదాయం బాగుంటుంది. ఒకరి మాటలను ఆధారం చేసుకొని అలవాటులేని పనులలో ప్రవేశించవద్దు. 10, 11 తేదులలో సౌఖ్యభంగం, భాగస్తులతో పేచీలు.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మీ శక్తిసామర్థ్యాలతో పరిస్థితులను చక్కబరచుకొని మంచి ఫలితాన్ని సాధించుకోగలుగుతారు. ఉద్యోగవృత్తులలో పైవారి ఆదరాభిమానాలు లభిస్తవి. అనవసరమైన ఆందోళన తగ్గిపోతుంది. కుటుంబంలో జరుగవలసిన పనులు తాత్కాలికంగా వాయిదాపడగల సూచనలున్నవి. అయితే భంగం అనేది ఉండదు. తోటివారితో చెప్పిన మాటను సాధించటంలో సాధారణమైన చిక్కులు ఎదురుకావచ్చు. కాని, కార్యసిద్ధి పొందగలుగుతారు. విద్యావిషయంలో ప్రోత్సాహ

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది.**



# శిలానేత్రం

పి. గణపతిశాస్త్రి

### జరిగిన కథ

విజయనగరంలో శృంగారమంజరి రెండవకుమార్తె హేమసుందరి, ఒక అర్ధరాత్రి ఆమెను కలుసుకొనవచ్చిన రంగనాయకుడు, కోవెలవారిని గాయపరిచి పోతాడు. గజదొంగ అనుకుంటారు నగరవాసులు. తరువాత వేశ్యమాతనూ కుమార్తెల సంగతిని విచారిస్తాడు. మాణిక్యవల్లి హేమసుందరి రంగనాయకుల రహస్యం తిరుమలశెట్టికి చెబుతుంది. అతను కోపావేశంగా వెళ్ళిపోతాడు. గోపాలయ్య ఎంత చెప్పినా వినక రంగనాయకుడు, హేమసుందరి కోసం ఆలయగోపురంమీదనుంచి సింహాచలాన్ని ఎదుర్కొంటాడు. ఆ గోపాలయ్య సాయంతో యింటికి చేరుకుంటాడు.

## 9

తెల్లవారేసరికి వెంకటనాయకుని ఇంట పెద్ద రభస ప్రారంభమైంది. విపరీతమైన నిస్త్రాణతో రవంతసేపు కన్నుమూసిన రంగనాయునికి ఆ కోలాహలంతో కొంచెం మెలకువ వచ్చింది. క్రమక్రమంగా తగిలిన గాయాల తీవ్రతంతా బాగా తెలిసివచ్చింది. సింహాచలం బాణాతో వీపుమీద కొట్టిన దెబ్బవల్ల పొడుగాటి దద్దురు లేచింది. పిడికిలిపోట్లతో మెడ బాగా వాచింది. వీపుమీద తగిలిన దెబ్బలతో సలుపు, పోటు ప్రారంభమయ్యాయి. గోపురం పై అంతస్తుమీద పడిపోయినప్పుడు గాని, గోపాలయ్య ఆసరాతో ఇంటికి నడిచి వచ్చినప్పుడు గాని, రంగనాయకుని కంతగా గట్టిదెబ్బలు తగిలినట్లు స్ఫురించలేదు. కాని కొంచెంసేపు కన్నుమూసి మేలుకొన్న తరువాత ఆ గాయాలన్ని క్రమక్రమంగా వాడి వాడి శూలాలై వేధించాయి. ఎంతగా యమయాతన అనుభవిస్తున్నా రంగనాయకుడు దానిని రవంతయినా పైకి వ్యక్తం కానీయలేదు. ఊపిరి బిగబట్టి ఆ విపరీత యాతన అతి కష్టంమీద లోలోపలే నిగ్రహించుకొన్నాడు.

అతని గది కొద్దంత దూరంలో పెరటిలో తల్లిదండ్రుల మధ్య బయలుదేరిన వాగ్వాదం మాట మాటకీ పెచ్చు పెరిగిపోతున్నది. తల్లి లక్ష్మీదేవమ్మ కొంచెం నచ్చ చెబుతున్నది. కాని ప్రతి మాటకొంటున్నకొద్దీ వెంకటనాయకుడు అహంకారావేశంతో హుంకరిస్తున్నాడు! రంగనాయకునికి మొట్టమొదట ఆ మాట అంత స్పష్టంగా వినిపించలేదు. కాని ఇప్పు డది అతని మనోవీధిలో

—38 వ పేజీ చూడండి

# పంతులుగారి పాఠం

ఒకరోజు ఊరిచివర రోడ్డుప్రక్క ఏడుస్తూ కూర్చునివున్న పదేళ్ళ పిల్లవాడిని, మాధవయ్య బడికి తీసుకువచ్చాడు. అంతవరకు ఏ పేరూలేని వాడికి 'రాముడు' అని నామకరణం చేశాడు.

రాముడికి బడిలో చేరిన నాలుగురోజులకు వర్ణ సమామ్నాయమూ వంద అంకెలూ వచ్చాయి.

రాముడి ముఖంలో తేజస్సూ కన్నుల్లో కళా చూచి, చురుకయినవాడనీ ఊరికే పేరుతెస్తాడనీ చాలామందితో చెప్పాడు మాధవయ్య.

ఒకరోజు ఉదయం కా గుణింతం చెప్పాడు. సాయంకాలం చెప్పమన్నాడు. వరిచేలో పరిగ ఏరు కొని వచ్చిన గింజలతో పంచదారచిలకలు కొనుక్కు తిన్న రాముడు గుణింతం చెప్పలేకపోయాడు.

మాధవయ్య ఆశలన్నీ నిరాశలయిపోయాయి. ఎంతో అభివృద్ధి ఎదురుచూచినవానిలో మరెంతో తిరోగమనం కనిపించింది. కోపం పట్టలేక గట్టిగా రెండు దెబ్బలు కొట్టాడు.

అరచేతులమీద తగిలిన దెబ్బలు పొంగాయి. పలక పట్టుకుంటే చేతులు నొప్పి పుడుతున్నాయి. లేత అరటిఆకులవంటి చేతులకు కాలిన ఇనుం ముక్క అంటించినట్లు అయింది.

చింతబెత్తం పాములాగా కనబడుతూవుంది. గుణింతం రెండోరోజుకూడా చెప్పకపోవటంతో మళ్ళీ దెబ్బలు తగిలాయి. చింతబెత్తం పాశంలాగా, పంతులుగారు యముడులాగా కనబడటం జరుగుతూంది.

ఎంత కొట్టినా గుణింతం చెప్పలేని రాముణ్ణి మొద్దు అని తేల్చుకున్నాడు మాధవయ్య. అందరితోనూ అలాగే చెప్పేశాడు. అయితే హృదయంలోపల వాడిమీద ఉన్న ఆశ పూర్తిగా నాశనంకాలేదు.

తోటి పిల్లలందరూ గుణింతం అంతా నేర్చుకున్నారు. కానీ రాముడు వెనకబడిపోయాడు. మాధవయ్య గుణింతం మానేసి రెండో ఎక్కం చెప్పాడు.

రెండోరోజు ఎక్కం చెప్పమని అడిగాడు. రాముడు చెప్పలేకపోయాడు. బెత్తం ఝళిపిస్తూ కొట్టబోయాడు. ఉన్నట్టుండి రాముడు ఒక్క దూకుతో బడివాకిలి దాటి, ఎవరికీ దొరక కుండా వాలుగాలి, తోకవంత తేలికగా వెళ్ళి పోయాడు.

వారంరోజులు బడికి రాలేదు. ఎంత వెదికినా దొరకలేదు. ఉదయం పలక తీసుకుని బడికి బయలుదేరి మధ్యలో మాయమవుతున్నాడు. చివరికి చెరువుగట్టుమీద ఉన్న రెండు తాటిచెట్లమధ్య దాక్కొనివున్న రాముడు దొరికిపోయాడు.

మళ్ళీ రెండో ఎక్కం అడిగాడు. రాముడు చెప్పలేకపోయాడు. కొట్టబోతుంటే పారిపోతాడని తలుపు దగ్గరకువేసి బెత్తం విరిగిపోయిందాకా కొట్టాడు.

బడికి రాక తప్పదని పారిపోవటానికి వీలు లేదని తెలుసుకున్నతరువాత పంతులుగారు బెత్తం ముట్టుకుంటే ఏడ్చేవాడు రాముడు.

"అనవసరంగా ఏందుకేడుస్తావ్" అని పంతులు గారు కొట్టేవారు. చేయగలిగింది ఏమీలేక సహించి ఊరుకునేవాడు.

పంతులుగారు కొట్టినప్పుడు ఏడిస్తే ఏడ వద్దని కొడుతున్నాడు కాబట్టి, కొట్టినా ఏడవ కుండా ఊరుకోవటం రాముడు అలవాటుచేసు కున్నాడు.

ఎవరిని కొట్టటానికి అయినా బెత్తం కదిపితే మెదలకుండా చేయిజాపి ఊరుకునేవాడు. అది చూచి పంతులుగారి హృదయం ద్రవించింది.

రాముణ్ణి కొట్టటంగానీ, తిట్టటంగానీ అనవ సరమనీ, వాడికి చదువు రాదనీ మాధవయ్య నిర్ణ యించుకొన్నాడు.

రాముడు ప్రతిరోజూ బడికి వచ్చేవాడు. వెళ్లి పోయేవాడు. మాధవయ్య పాఠం చెప్పేవాడుకాదు. చెప్పమని రాముడు అడిగేవాడూ కాదు.

బడిలో మాట్లాడేవాడు కాదు. ఆటలు ఆడు కోడు. అల్లరి చేయడు. గంతులు వేయడు.

అలా అని బడిలో నిద్రపోయేవాడు కాదు. పైకప్పులో కదిలే సాలెగూడూ దాని అల్లికలో అందమూ, కిటికీలోంచి కనిపించే పచ్చని పైరులూ చూస్తూ ఉండేవాడు.

ఒకటోతరగతి మొదలుకొని అయిదో తరగతి దాకా అన్ని పాఠాలు మాధవయ్య చెబుతూ ఉండే వాడు.

రాముడుతోపాటు బడిలో చేరిన పిల్లలు త్వర త్వరగా చదువుకుంటూ వెళుతున్నారు.

మాధవయ్య అయిదో తరగతికి ఆవుపాఠం చెబుతూ ఉంటే రాముడు ఆవుబొమ్మ వేసుకుంటూ దిక్కులుచూస్తూ ఉండేవాడు.

తాడిచెట్టు — దాని ఉపయోగాలుగూర్చి పంతులుగారు చెబుతూవుంటే, తాటి ఆకుల బడి కప్పూ తాటివాసాల నిట్రాళ్లూ చూచేవాడు. తాటి బుట్టలూ, తాటి ముంజలూ గుర్తుకు తెచ్చు కుని నోరు ఊరుతూవుంటే నోట్లో వ్రేలు పెట్టుకుని చీకుతూ ఉండేవాడు.

ప్రతిరోజూ సాయంకాలం పిల్లలు ఆడుకుం టూంటే చూస్తూ చిన్న పిల్లవాడు అయిపోతాడు మాధవయ్య.

పంతులుగారు లేనప్పుడు పిల్లల ఆటలు మరో పంథాలో సాగుతూ ఉండేవి.

తూనీగల్ని పట్టుకుని సగానికి రెక్కలు త్రుంచి వేలమీద విడిచిపెడితే ఎగరాలనే తాపత్రయంతో అవి గంతులు వేస్తూవుంటే పిల్లలుకూడా ఎగురుతూ ఉండేవారు. అవి ఎగరకపోతే చూస్తూ సంతో షించే తోటివాళ్లని ఏమీ అనలేని రాముడు కళ్ల లోంచి నీటి బిందువులు జారేవి.

తూనీగల రెక్కలు ఉంచి తోకలకు దారాలు కట్టి విడిచిపెడితే అవి ఎగిరిపోగా దారాలు ముళ్ల కంచెలకు పట్టుకొని ఆకాశంలోనూ అల్లాడేవాటిని చూచి ఏమి ఆనందం పొందేవాళ్లో పిల్లలు రాము డికి అర్థమయ్యేది కాదు.

ఎవరో ఇద్దరు పిల్లలు చీమలకన్నాల్లో వ్రేళ్లు పెట్టి వెదికితే బలపాలు దొరుకుతాయనీ, తమకు దొరికాయనీ చెప్పారు. రాముడు అలాగే వెతికాడు. బలపాలు దొరకలేదు. చీమలు కుట్టాయి. తిరిగి వెతికాడు. ఎంతకీ బలపాలు దొరకలేదు.

అతన్ని, అతని అమాయకత్వాన్ని పిచ్చితనంగా, తెలివితక్కువగా భావించి అల్లరి అల్లరిగా నవ్వు తున్న పిల్లల్ని చూడటంతో వాడికి ఎక్కడలేని ఏడుపూ వచ్చింది.

పిల్లలు గోళీకాయ లాడుకుంటూవుంటే రాముడు చూచి, ఇంటికిపోయి, డబ్బులు తెచ్చు కొని చేయినిండా గోళీలు కొని, ఆడుకోవటం కోసం వెళ్లాడు.

గోళీల పందేల ఆటలో రాముణ్ణి చేతకాని వాణ్నిచేసి పిల్లలు అన్నీ కాజేశారు. ఏడుపు వచ్చింది. ఏడిస్తే పంతులుగారు కొడతారేమో నని మెదలకుండా ఊరుకున్నాడు.

బడిదగ్గర ఎవరో పిల్లలు బిళ్లాకర్రా ఆడు కొంటున్నారు.

రాముడు ఆట చూస్తూ దూరంగా నిలబడి ఉన్నాడు. బిళ్ల లేచి వచ్చి నుదుటికి తగిలింది. కంటిమీద బొప్పి కట్టింది. కొంచెం నెత్తురు వచ్చింది.

రాముడు ఎవరితో ఏమీ చెప్పలేదు. ఇంట్లో గాని, బడిలోగాని ఏమీ ఫిర్యాదుచేయలేదు.

మాధవయ్య అడిగాడు, అదేమిటిరా అని. పడ్డా నని మాత్రమే చెప్పాడు రాముడు.

ఎవరో పిల్లవాడు జరిగింది జరిగినట్లు చెప్పాడు. ఆ విషయం విన్నతరువాత పంతులుగారికి బాధ కలిగింది. జాలివుట్టింది.

పలక పుచ్చుకుని, తల వంచుకొని మెల్లగా వెళుతున్న రాముణ్ణి చూచి 'పిచ్చిరాముడు' అను కున్నాడు మాధవయ్య తనలో తాను.

ఆ ఊరిలో ఒక ఆంబోతు ఉండేది.

దాన్ని అందరూ పూజిస్తూ ఉంటారు. అది కనిపిస్తే నమస్కరించటం గ్రామంలో పరిపాటి అయింది.

ఆ ఆంబోతు ఏపొలంలో ఏంమేసినా ఎవరూ ఏమీ చేయరు.

దానికి ఎప్పుడూ కోపంరాదు.

అటువంటి ఆంబోతుకే అన్యాయం జరిగింది. జొన్నచేలోపడి మేస్తూవుంటే ఎవరో ఇద్దరు బడితెలతో బాది పారిపోయారు. వాళ్లని వెంటా డుతూ ఆంబోతు రంకెలువేస్తూ ఊరిలోకి వచ్చింది.

ఆరోజు ఆంబోతు కనపడిన ప్రతివాడినీ పొడిచి పోతూ వుంది. ఏదో విపరీతం జరిగిపోతూ ఉందని మాధవయ్య కలతజెందాడు.

పంతులుగారు భయపడిపోయారు. బడిముందు ఆడుకుంటున్న పిల్లల్ని లోపలికి కేకేశాడు. అందరూ పోయి మాధవయ్యను చుట్టుముట్టి నిలబడ్డారు.

రాముడు కిటికీలోంచి చూస్తున్నాడు. దూరంగా ఉన్న వేపచెట్టుక్రింద ఉన్న కుంటికుర్రాడు పరు గెత్తలేక కూర్చుండిపోయాడు. ఆంబోతు అటు వైపే వెళుతూవుంది.

రాముడు మెరుపుతీగలాగా బడివెలుపలికి వచ్చి, పరుగుపరుగున పోయి కుంటివాడిని ఎత్తుకొని ఆంబోతుకి ఎదురురాకుండా చెరువుమలుపు తిరిగి రెండు పాముల మధ్యకు చేరి కూర్చున్నాడు.

# పంతులుగారి పాఠం

రాముడు వెళ్ళటం చూసి రెండు క్షణాలు ఆగిపోయి, ఆపై చూసి, మళ్ళీ రంకెలు వేసుకుంటూ ఆంబోతు పొలాలలోకి వెళ్ళిపోయింది.

బడిలో నిలబడి రాముడువైపు చూస్తున్న పంతులుగారి హృదయంలో అమృతభావాలు తరంగితమవుతూ ఉన్నాయి.

ఆంబోతు తరుముకుంటే ఆ ఇద్దరూ చచ్చిపోయి ఉండేవాళ్ళు. అంత ఆవేశంలోనూ అది ఆలోచించగలిగింది.

ఆంబోతు వెళ్ళిపోయింతరవాత కుంటికుర్రాడిని ఎత్తుకొని రాముడు పొలాల మధ్యనుంచి బైటికి వచ్చాడు.

రాముడికి భయం కలిగింది. పంతులుగారి చేతిలో చింతబెత్తం నాగుపాములాగా కదలాడుతూంది.

కుంటికుర్రాడిని విడిచిపెట్టి ఎటయినా పారిపోదామనుకున్నాడు. వాడికి భయంకలగటానికి కారణం మరేమీ లేదు. వారు చెప్పినట్టు బడిలోనే కూర్చోలేదు. పైగా వారిని అడుగకుండా బడి విడిచిపెట్టి వెలుపలికి వచ్చాడు.

పంతులుగారు కొట్టవచ్చు, అనుకున్నాడు రాముడు.

అవిటివాడిని ఆపదనుంచి రక్షించాడని మాధవయ్యహృదయం ఆనందంతో చలించిపోతూవుంది.

ప్రేమ ఉప్పొంగుతూన్న పొంగుతూవున్న పంతులుగారి చేతిలో బెత్తం చూసి రాముడు భయంతో వణికిపోతున్నాడు.

మాధవయ్య దగ్గరకువచ్చిన మరుక్షణంలో కుంటికుర్రాడిని కూర్చోబెట్టి చేయిచాపి నిలబడ్డాడు రాముడు.

చేయి అలా ఎందుకు చాపుతున్నాడో పంతులుగారికి అర్థంకాలేదు. ఆపైన ఇలా అనిపించింది. మీమాట విని బడిలో కూర్చోకుండా, మిమ్మల్ని అడగకుండా వెలుపలికి వచ్చినందుకు కొట్టండి అన్నట్లుగా ఉంది చిన్ని చిన్ని వ్రేళ్ళ లేతచేయి.

పంతులుగారు బెత్తంవైపు, రాముడి ముఖంవైపు చూశారు. వాడి కళ్ళలోని ఏదో కాంతిప్రవాహం దుఃఖంపొరలమధ్య మరుగుపడిపోతూ ఉంది.

పంతులుగారు రాముణ్ణి పట్టుకున్నారు. బెత్తంవైపు చూస్తూ వణికిపోతున్నాడు రాముడు.

బెత్తం కనిపించకుండాచేస్తే రాముడికి భయం తగ్గిపోతుందని పంతులుగారు భావించి ఒక చేతిలోంచి మరొక చేతిలోకి మార్చుకున్నారు.

పంతులుగారు కొట్టటానికి తయారవుతున్నారని రాముడు అనుకున్నాడుకాబోలు ఏడ్పు ప్రారంభించాడు.

మాధవయ్యహృదయం కరిగిపోయింది. బెత్తం ముక్కలుముక్కలుగా విరిచి ప్రక్కనే ఉన్న చెరువులో పారేశారు. ఆ ముక్కలు నీళ్ళమీద తేలి తేలి ఆవలిగట్టుకు చేరాయి.

రాముడిముఖంలో ఏడ్పు మాయమయింది. పంతులుగారు కన్నీరు తుడిచారు.

ఉన్నట్టుండి రాముడు గుణింతం చెప్పటం ప్రారంభించాడు. కా గుణింతం చెప్పాడు. అంతే కాదు. యాగుణింతంకూడా చెప్పాడు. రెండో ఎక్కంనుంచి పదహారో ఎక్కందాకా పొల్లు పోకుండా చెప్పాడు. అంతేకాదు, అప్పసోం చెప్పాడు. తాటిచెట్టు ఉపయోగాలు చెప్పాడు.

మాధవయ్య హృదయంలో పొంగుతున్న ఆనందాల కెరటాలు ఎత్తు ఎంత ఉందో తన్మయత్వంలో తబ్బిబ్బు అవుతున్న ఆయన గమనించలేకపోయాడు.

పంతులుగారు ఏతరగతిలో ఏం చెబుతూ ఉంటాడో, రాముడు ఏమేమి విన్నాడో అదంతా చెప్పేశాడు. మాధవయ్య రాముణ్ణి ఎత్తుకున్నాడు. కుంటిక్కుర్రాడు నేలమీద దేకుతూ వెంట వస్తున్నాడు.

* * *

ఇది జరిగి ఇరవై సంవత్సరాలు అవుతూ ఉంది. ఇప్పుడు పట్నంలో తహసీల్దారుగా పని చేస్తున్న రాముడు ఆ పల్లెకు వస్తే పాత జ్ఞాపకాలతోపాటు పంతులుగారి ఆకారం గుర్తుకువచ్చి ఆయన్ని చూడ్డానికి వెళితే వారి చేతిలో బెత్తం ఉండదుకాని నిగతా రూపమంతా మామూలుగానే ఉంటుంది. ★

---

కొత్త యువకునికి వార్తా సంకలనంలోని కిటుకులను విశదపరిచాడు పెద్ద.

"చూడు బాబూ! వార్త యొక్క శీర్షిక పాఠకుని మనస్సుని ఆకర్షించేటట్లు వుండాలి. ఉదాహరణకి యీ రైలు ప్రమాదమే తీసుకో. మెయిలుబండి, గూడ్సుబండీ ఢీకొని నలుగురు ప్రయాణీకులు మరణించారని కదా! దీనికి శీర్షిక ఎలావుండాలంటే "గూడ్సు బండితో మెయిలుబండీ ఢీ! అలాగే ఉపశీర్షికలు కూడా ఆకర్షనీయంగా వుండాలి"

అందిస్తే అల్లుకుపోయేరకం ఆ యువకుడు, రెండు నిముషాల్లో ఆ వార్తకు శీర్షిక ఉపశీర్షికలను వ్రాసుకొచ్చాడు. "గూడ్సు బండితో మెయిలుబండి ఢీ!" "నలుగురు — ప్రయాణీకులు ఢా!"

డి. గోపాలకృష్ణమూర్తి (గద్వాల)

---

# విశాల నేత్రాలు

31-వ పేజీ తరువాయి

ఉంగరాలను నూరూ మ్రోగుతున్నాయి! వెంకట నాయకుడు రుసరుసలాడుతూ గద్దించాడు:

'సరేలేగాని, భళ్ళుమని తెల్లవారేదాకా ఏ దెక్కడ ఉన్నట్టు? ఏమి చేస్తున్నట్టు?'

లక్ష్మీదేవమ్మ ఆ ప్రశ్నమీద గొంతు కొంచెం తగ్గించి అనునయగర్భిత స్వరంతో అసలు సంగతి మభ్యపెట్టింది:

'అనవసరంగా అనుమానపడుతున్నారు గాని వాడింటికి వచ్చేసరికి అంతగా ఆలస్యం కాలేదు. మీరు పరుపుమీద పడుకుని గుర్రుపెట్టి నిద్ర పోతున్నారు. అంతలోనే వా డింటికి వచ్చాడు.'

ఆ ప్రత్యుత్తరంతో వెంకటనాయకుడు మరింతగా రెచ్చిపోయాడు.

'పాపం! పడుకుని గుర్రుపెట్టి నిద్రపోతున్నా ననుకున్నావా? ఎంతోసేపు నిద్రపోలేదులే! వీడెప్పుడు వస్తాడా అని రాత్రి తెల్లవార్లు మేలుకుని ఒక కంట కనిపెట్టి చూస్తూనే ఉన్నాను. ఆ గోపాలయ్యతో కలిసి ఇప్పుడే కదా, వీ డిక్కడికి వచ్చాడు? నే నది కనిపెట్టలే దనుకొన్నావా? అసలు నీమూలానే వా డింతగా పేట్రేగిపోతు న్నాడు! నేను మొట్టమొదటినించి చెబుతూనే ఉన్నాను, అతి గారాబం చెయ్యవద్దని! నా మాట విన్నావా! సరే, ఇక అనుభవిస్తువుగాని! కాక పోయినా ఆ మేనమామ పోలిక ఎక్కడికి పోతుంది? మునుమ్మూర్తులా నీ తమ్ముడే మళ్ళీ మన వంశంలో అవతరించాడు! అంతే!'

పెనిమిటి తన తమ్ముడి పేరెత్తి పుట్టింటి మీద విరుచుకుపడిన తరవాత లక్ష్మీదేవమ్మ ఓరిమి కాస్త అడుగంటింది. అపైన వా రిద్దరు అసలు రంగనాయకుని మాటే పట్టించుకోలేదు. ఒండొరుల కుటుంబాల ఆర్థ్యేయ పౌరుషేయాల లోపాలుట్టంకించి రెట్టించి ధుమధుమలాడుతూ ఏవేవో తెలిసీతెలని గొడవలలో పడ్డారు.

ఆ తరవాత గోపాలయ్య వెంకటనాయకునికి ఇంటిగుమ్మంలో కనిపించాడు. అతనిని చూసిన పిమ్మట వా రిద్దరు తిరిగి వాగ్వాదం ప్రారంభించ లేదు. మరి కొంతసేపటికి పెరటిలో లేగదూడ గొంతెత్తి 'అంభా' అని అరిచింది. పాలు పితికే వేళ దాటిపోయిందని లక్ష్మీదేవమ్మ తొందర తొందరగా అక్కడినించి వెళ్ళిపోయింది. గోపా లయ్య లోపలికి వస్తూనే రంగనాయకుడు ఎక్కడ ఉన్నాడని అడిగాడు.

'ఆ ప్రబుద్ధు డింకా లేవలేదులా ఉంది! అడిగో, ఆ పక్క గదిలో పడుకున్నాడేమో!' అన్నాడు వెంకటనాయకుడు రుసరుస లాడుతూ. గోపా లయ్య ఆ గదిలో అడుగుపెట్టి నిలువునా నిర్ఘాంతపడి, 'ఇదేమిటి? ఇలాగున్నావు? జ్వరం గాని తగిలిందా?' అని పక్కమీద కూర్చుని దుప్పటి ముసుగు కొంచెం తొలగించి ఒంటిమీద చెయ్యివేసి 'అబ్బా! ఒళ్ళు పేలిపోతూందే!' అన్నాడు.

వెంకటనాయకుని కప్పటి వరకు కుమారుని వాస్తవ పరిస్థితి అవంతయినా అవగాహన కాలేదు. గోపాలయ్య నోట జ్వరమున్నమాట వెలువడిన పిమ్మట వెంటనే కొడుకున్న గదిలో ప్రవేశిం చాడు. రంగనాయకు డొక తుంగచాపమీద పరిచిన బొంగుబయారి పరుపుమీద కాళ్ళు, చేతులు ముడుచు కుని పడుకున్నాడు. కుమారుని ముఖంపై ఛరిని గమనించి వెంకటనాయకుడు ఎంతో ఆశ్చర్యపడి, మరికొంతసేపటి వరకు నోట మాటే వెలువడక అలాగే నిలుచున్నాడు! దుప్పటి ముసుగు కొంచెం తొలగించి వీపుమీద చెయ్యివేసి పెద్ద జెర్రిగొడ్డులా తేరుకున్న దద్దురు గమనించి 'ఇదేమిటి రంగన్నా! ఈ దెబ్బ ఎక్కడ తగిలిందిరా?' అని గట్టిగా గద్దించాడు. రంగనాయకుడు ఆ ప్రశ్న విని ఇంకొక వైపు తిరిగి పడుకుని నన్నగా మూలిగాడు. అంతే గాని ప్రతి సమాధానం చెప్పలేదు! వెంకటనాయకు డిక భరించలేక గోపాలయ్యకేసి చురచుర చూసి ఎడతెగని ప్రశ్నల జడివాన కురిపించాడు:

'ఏమిరా! గోపాలయ్యా! రాత్రి మీ రిద్దరు ఎక్కడికి వెళ్ళారు? భళ్ళుమని తెల్లారేదాకా ఏమి చేస్తున్నారు? వీడికి ఈ గట్టిదెబ్బలన్ని ఎక్కడ తగిలాయి? ఎవరు కొట్టారు? ఎందుకు

---

ప్లీడరు:- (సాక్షితో) నువ్వేమీ చదువుకో లేదన్నావు మరి ఇంత తెలివిగా జవాబు లెలా చెప్పుతున్నావు?

సాక్షి:- బుద్ధితక్కువ ప్రశ్నలకి జవాబులివ్వడానికి చదువక్కర లేదండి అనుభవంచాలు.

టి. రామమోహన్ (హైదరాబాదు)

---

కొట్టారు? అయ్యయ్యో! ఒళ్ళంతా హూనమయిపోయినట్టుందే! మాట్లాడవేమిరా?'

అని అప్పు సాము గరిడీల సాధనలో తగిలిన గాయాలని చెప్పి వెన్నెలని ఆ చిక్కులోనించి తప్పించ వచ్చునని మొట్టమొదట ఆలోచించాడు గోపాలయ్య. అయితే ఆ సాధన ఎంతగా మితిమీరినా ముఖం మీద, కణతలమీద, వెడమీద అంతటి గట్టి గాయాలు తగలవు. అదిగాక రంగనాయకుని కేసి చూసినవారు అతడేదో పెద్ద కొట్లాటలో ఇరుక్కొని ఉండవచ్చునని ఇట్టే కనిపెట్టివేయగలరని అనుమానించాడు. కనుక వట్టి అబద్ధా లాడడం వల్ల లాభంలేదని గ్రహించుకొన్నాడు. అందుచేత వాస్తవస్థితి బయటపెట్టక, అసత్యంతో బాగా మేళవించిన నిజం కొంచెం వెల్లడించాడు:

'అంతగా విడ్డూరమేమి జరగలేదు మామా! సాము గరిడీ అయిన తరువాత నిన్న సాయంకాలం మే మిద్దరము స్వామి దర్శనం చేసుకొని, చాలా సేపు చల్లగాలిలో గోపురంమీద కూర్చున్నాము. ఆ తరవాత ఇద్దరం కలిసి తిరిగి వస్తూంటే తప్ప తాగినవా డెవడో అకస్మాత్తుగా బాకాక్రతో మా మీద విరుచుకుపడ్డాడు. నా మేనకోడలి రంగన్న ఉక్కు స్తంభంలా ఉన్నాడు! వంగరేసి పెనుగులాడినా వాడిదే పైచెయ్యి అయింది! ఇక లాభంలేదని పారిపోవాలని పరుగు మొదలు పెట్టాము. అయినా చాలాసేపటిదాకా వాడు మమ్మల్ని వెంటాడించడం మానలేదు. చిట్టచివ రకి ఎలాగో అలాగ తప్పించుకొని తెల్లతెల్లవారే వేళ ఇంటికి చేరుకున్నాము. పొద్దున్నే లేచి ఎవరి మొహం చూశామో గాని చావు తప్పి కన్ను లొట్ట పోయినంతపని అయింది.'

'అయితే నీ ఒంటిమీద ఒక్క దెబ్బయినా పడలే దెందుచేత?'

ఆ ప్రశ్నతో గోపాలయ్య బాగా ఇరుకులో పడ్డాడు. కాని కొంచెం మెళకువతో తప్పించుకొన్నాడు:

'వస్తూనే వాడు రంగన్నమీద విరుచుకుపడ్డాడు మామా! కనకనే ముందుగా మీవాడికి గట్టి దెబ్బలు తగిలాయి. నేను పక్కపక్కనే నిలబడి తప్పించుకుంటూ ఎదురు దెబ్బలు తీశాను. ఇందు చేత నాకేమీ గాయాలు తగలలేదు.'

వెంకటనాయకుడు క్షణకాలం గోపాలయ్య వైపు తీవ్రంగా చూసి తల పంకించాడు. జరి గిన కథ బయట పెట్టకుండా అతడేదో కట్టు కథ అల్లుతున్నాడని గ్రహించడానికి కతని కెంతోసేపు పట్టలేదు. రంగనాయకుని దుందుడుకు చేష్టల సంగతి తలవరి అంతకుమునుపే వెంకటనాయకుని చెవిలో వేశాడు. అంతలోనే ఇంత గొడవ జరి గింది! అందుచేత ఈ రభసలో ఏదో అంత రార్థం ఉండితీరాలని ఆత డూహించుకొన్నాడు. ఆట్టుడికిన ట్టుడికిపోతూ మళ్ళీ గద్దించాడు:

'ఒరేయ్ గోపాలయ్యా! కల్లబొల్లి మాటలు చెప్పి నమ్మించడానికి నేనేమన్నా పాలు తాగుతున్న పసివాణ్ణనుకున్నావా! ఆ మాత్రం గ్రహించుకోలే ననుకొన్నావా? మీ రిద్దరు కలిసి శృంగార మంజరి భవంతిలో జొరబడి చేసిన అల్లరి నాకు తెలియలే దనుకొన్నావా? ఊరికే ఉత్త పుణ్యాని కని దారమ్మట పోయేవా డెవడో నీమీద పడి ఎందుకు కొడతాడు? అసలు వా డెవడు? అర్ధ రాత్రివేళ అంత రభస ఎందుకు జరిగింది? ఇప్పు డయినా మించిపోయిన దేమి లేదు! ఉన్నది ఉన్నట్టు చెప్పు! నీకేమి భయంలేదు! నే నున్నానుగా! మాట్లాడవేం!'

'నిజమే మామా! ఇంతకంటె మేము ఏ పాపము ఎరగము! ఎవడో మా మీద అమాయకొద్దీ లేని పోని అపనింద కల్పించి ఉంటారు! నమ్ము! నమ్మకపో! తప్పతాగిన తుంటరి ఎవడో మా మీద విరుచుకుపడితే ఎలాగో అలాగ తల దాచుకుని ప్రాణాలతో బయటపడ్డాము. ఇంతకన్న మావల్ల జరిగిన అపరాధ మేది లేదు!'

ఆ సమాధానం విని వినగానే వెంకటనాయ కుడు మరింతగా మండిపడ్డాడు:

'చాల్చాల్లే నోర్మూయి! నువ్వు చెప్పకపోతే ఈ నేత కాకపోతే రేపటికయినా నా కది తెలియదనుకొన్నావా? అసలు నీ మూలానే మావా డిలాగ పాడయిపోతు న్నాడు! మీ వాళ్ళతో చెప్పి నీ సంగతి నేను కను క్కుంటాగా! ..... పాలం లేదు! పుట్ట లేదు. పనిలేదు! పాటలేదు! పొద్దస్తమానము అన్ను పానుత అంటోతూ తిరగడమేనా మీరు చేసేపని! ఆతి పెద్ద కళ్ళూ కాళ్ళ మంచి పెళ్ళ తెలియక

పోతే ఇంకెప్పుడు వస్తుందిరా బుద్ధి! మాట్లాడవేం!'

అలాగ దులిపివేసి గట్టిగా చీవాట్లు పెట్టిన తరవాత గోపాలయ్య మరి వంచిన తల పైకెత్త లేదు! 'అన్యాయ్యంగా అనవసరంగా కూడా తననిలా నింద వేస్తున్నాడని అతని కెంతయినా రోషం వచ్చింది! కాని గత్యంతరంలేక ఒకటి రెండు నిమిషాలపాటు అలాగే నిలబడి రవంత గద్గదికతో రుసరుసలాడుతూ గిరుక్కున వెనక్కి తిరిగి ఒక్క అంగలో వీధిలో పడ్డాడు! మొట్టమొదటినించి ఆ రభస అంతా విన్న లక్ష్మీదేవమ్మ ఇక భరించలేక తన పని మధ్యలోనే తొందర తొందరగా అక్కడికి వచ్చి భర్తకేసి తిరిగి రుసరుస లాడింది:

'శుభమస్తే తెల్లవారగానే ఇదేమిటండీ! ఈ గోల! ఆ గోపాలయ్యని పట్టుకుని అలాగ దులిపేస్తున్నా రేమిటి? పరాయి పిల్లవాణ్ణి పట్టుకుని అంతంత లేని మాటలంటే బాగుంటుందా? ఇంతకీ పాపం వాడేం జేశాడు?'

'ఏం జేశాడా? అదిగో, ఆ గదిలోకి వెళ్ళి నీ కొడుకు ఒళ్ళు ఎలాగ హూనమయిపోయిందో చూడు! నిన్న రాత్రి తప్ప తాగినవా డెవడో పిల్లవాణ్ణి చావగొట్టి చెవులు మూశాడట! ఇంతకీ ఇదంతా ఎందుకు జరిగిందో చెప్పమంటే వీడుగాని, వాడుగాని అసలు సంగతి బయట పెట్టరే! బెల్లం కొట్టిన రాళ్ళలాగ మాట్లాడ కూరుకుంటారే! ఇక నేనేమి చేసేది?'

వెనువెంటనే లక్ష్మీదేవమ్మ ఆ పక్క గదిలోకి వెళ్ళి కొడుకు ఒంటిమీది దుప్పటి తొలగించి చూసి నిలువునా దిగాలుపడి నేలమీద చదికిలబడి బుడి బుడి దీర్ఘాలు మొదలుపెట్టింది:

'అయ్యో! ఇదేమిటి నాయనా! వీపుమీద ఈ దద్దురు! ఒళ్ళంతా ఇలాగ వాచిపోయిందేమిటి?.... బాగా జ్వరం కూడా తగిలినట్టుందే! ...... ఎంత సేపు ఒళ్ళెరుగని నిద్రావేశమేగాని కాస్త కట్టుకట్టి కాపటం పెట్టాలని కూడా తోచలేదేమండీ! మీకు! ఎన్నేళ్ళు పైబడినా ఏమిటి ప్రయోజనం! కాస్త ఇంగితజ్ఞానం లేకపోయాక! .... అయ్యో! రామ! ఇంతకీ ఒకరిని అనవలసిన పని ఏము ఉంది? చేసుకున్న కర్మ అంతా అనుభవించక తప్పుతుందా!'

వెంకటనాయకుడు ఇక ఆ అధిక్షేపణ వినలేక, ధుమధుమ లాడుతూ పెరటిలోకి వెళ్ళిపోయి, హఠాత్తుగా పలుపుతాడు తెంచుకుని పాలు కుడుచుకుంటున్న కోడెదూడ మీద తన అక్కసంతా వెళ్ళగక్కుకున్నాడు! ఆపైన లక్ష్మీదేవమ్మ కొడుకు గాయాల కన్నిటికి జాగ్రత్తగా కట్లుకట్టి, వేణ్ణీళ్ళతో ఒంటికి కాపటంపెట్టి పెరటిలో ఉన్న పెనిమిటి దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా ప్రాధేయపడింది.

'ఏమండీ! మాట్లాడరేం! అబ్బాయి ఒళ్ళు పేలిపోతూందండీ! కాస్త కుమ్మరి గురవయ్యా నొకసారి పిలుచుకురండీ!'

అయినా వెంకటనాయకుని దురాగ్రహధోరణి తగ్గలేదు:

'మరేం భయంలేదు! దానంతట అదే తగ్గిపోతుంది. నా కిప్పుడు ఖాళీగా తీరికలేదు. పొలం వెళ్ళి పని చూసుకోవాలి!'

లక్ష్మీదేవమ్మ వెళ్ళబోయింది. 'ఎందుకండీ మీకంత కోపం! వాడేమి చేశాడని! చిన్నతనంలో మీకు మాత్రం దుందుడుకుతనాలు చెయ్యలేదా ఏమిటి? మాట్లాడరేం? పోనీలెండి! మీరు వెళ్ళకపోతే నేనే వెళ్ళి పిలుచుకువస్తాను.'

ఆ తిరస్కార ధోరణితో వెంకటనాయకుడు భగ్గుమని మండిపడ్డాడు:

'గుమ్మం దాటి వీధిలో అడుగుపెట్టిచూడు! నిన్నేం చేస్తానో!'

'ఏమిటి చేస్తారు! మనమేమన్నా మహారాజులమా! అంతఃపుర మర్యాదలతో అగ్గగ్గలాడిపోవడానికి? మింగ మెతుకులేదు! మీసాలకు సంపెంగ నూనె! అన్నట్టుంది మన పని!'

ఆ సమాధానం సూటిగా వెళ్ళి వెంకటనాయకుని నిండు గుండెలో నిశితశూలంగా నాటుకొన్నది. అతని ముత్తాత కాంచీ రాజ్యానికి కొక చిన్న సామంత ప్రభువు! ఇప్పుడా సిరిసంపదలేవీ లేకపోయినా, అత డటువంటి మర్యాదతోనే ఈ నాటి వరకు తన సంసారయాత్ర కొనసాగించుకొంటున్నాడు. ఎక్కడో మారుమూల వీధిలో ఉన్న కుమ్మరి గురవయ్య ఇంటికి బయలుదేరుతున్నానని భార్య అనగానే అతని రాజసానికి కొక గట్టి దెబ్బ తగిలింది. తమ ప్రస్తుత సాధారణ పరిస్థితి జ్ఞప్తికి రాగానే లోలోపలి అహంకారం కోడె త్రాచులా బుసకొట్టి కన్నుమిన్ను చెలరేగింది:

'సరే! వెళ్ళు! కాని గుమ్మందాటి వీధిలోకి వెళ్ళావంటే మళ్ళీ నీ వీ ఇంటిలో అడుగుపెట్టనివ్వను! తెలిసిందా?'

'పోనీ! నాకేమన్నా అంత గతి కరువైపోయిం దనుకున్నారా! తిన్నగా మావాళ్ళ ఇంటికి వెళ్ళిపోతాను. వాళ్ళు నా కింత ముద్ద పడెయ్యకపోరులెండి!'

'వెళ్ళు! ఇప్పుడే వెళ్ళిపో! నీతోబాటు నీ కొడుకుని కూడా తీసుకుపో! పీడమూళ్ళాన్ని నే నివస్య నలుగురిలోను తల ఎత్తుకుని తిరగలేకుండా ఉన్నాను! తెలిసిందా? ఎందుకెందుకని ఇన్నాళ్ళ నించి ఓపికపట్టి మాట్లాడ కూరుకున్నాను. ఇహ నేను నాకీ మొహం చూపదలుచుకోలేదు! నాకు కోపమే రాదుగాని, వస్తే అంతే! నువ్వు వాడు కలిసి కట్టుకట్టుకుని కావేరిలో దూకండి! ఏం నన్నేమన్నా బెదిరిద్దా మనుకుంటున్నావా?'

"నాకు ముక్కుమీద కోపం కంటికి జోడు రెండూ అలంకారాలంటున్నమ్మండీ" అని ధాబులు పలికాడు అహంకారి. "అలాగా కళ్ళజోడు ఒకసారి తియ్యండి చూద్దాం" అన్నాడు తుంటరి.

"అంటే తియ్యలేననా" కోపంగా అన్నాడు అహంకారి.

"అనేగా"

అతడు "ఇదిగో" నంటూ జోడు తీశాడు కోపంగా, ముక్కున గుద్ది సరే నన్నుపోల్చుకోమ"ని పారిపోయాడు తుంటరి.

కె. జనార్దనమూర్తి (నెల్లూరు)

దుస్సహ క్రోధావేశంతో వెంకటనాయకుడు గబగబ నడిచిపోయాడు.

పెనిమిటి ఆవిధంగా పోటీకి వచ్చినట్టు గట్టిగా దులిపివేసేసరికి లక్ష్మీదేవమ్మ మారు మాటాడ లేక గుడ్ల నీరు కుక్కుకుని, బుడి బుడి దీర్ఘాలతో పెద్ద రాగాలు మొదలుపెట్టింది. ఆ దుఃఖావేశంలో పడి ఆమె మరి కుమ్మరి గురవయ్య మాటే తలపెట్టలేదు!

రంగనాయకునికి తల్లిదండ్రుల మధ్య నడిచిన రభస అంతా స్పష్టంగా వినిపించింది. క్రమక్రమంగా గాయాలబాధ ఇనుమడిస్తున్నట్టనిపించింది. తన యావచ్ఛక్తి వినియోగించి, ఊపిరి బిగబట్టి అతడా యమయాతన అంతా లోలోపలే నిగ్రహించుకొన్నాడు. అంతేగాని ఒక్క చిన్న మూలుగయినా పైకి వెలువడనీయలేదు.

## 10

తిరుమలరెడ్డి పంపించిన ముత్యాలు ఎన్నిసారులు ప్రయత్నించినా ఏకాంతంలో హేమసుందరి సందర్శనం సాధ్యపడలేదు. అయితే ఒకనాటి దీపదీపాలవేళ శృంగారమంజరి భవంతిలో ఎవ్వరులేని సమయం కనిపెట్టి హేమసుందరి దగ్గిరికి వెళ్ళింది. మొట్టమొదట లోకాభిరామాయణం మొదలుపెట్టి చల్లచల్లగా తన వ్యవహారం బయట పెట్టింది. రత్నాంగుళీయకం చిటికెనవేలి కలంకరించబోయింది. కాని హేమసుందరి దాని కంగీకరించలేదు. 'పోనీ ఒక్కసారి వేలికి పెట్టి చూడనీ! సరిపోతుందో లేదో చూస్తాను.' అని మళ్ళీ బలవంతం చేసింది. అక్క మాణిక్యవల్లికి తెలిస్తే ఇక తన ఆబోరు దక్కదని చెప్పి తప్పించుకుని కొంచెం దూరంగా జరిగింది హేమసుందరి. అయినా ముత్యాలు వదిలిపెట్టక ఆమె చెయ్యి దొరకబుచ్చుకొని 'అజాగ్రత్తనేను పడతానుగా! లోకుల కళ్ళు గప్పి రెండో కంటివాడికి తెలియకుండా నిన్నక్కడికి తీసుకువెళ్ళే పూచీ నాది! అంతేగాని పదిమంది కళ్ళబడట బాహాటంగా మేనాలో కూర్చోబెట్టి తీసుకువెడతా ననుకున్నావా ఏమిటి? నే నంతటి తెలివితక్కువదాన్ని కాదులే!' అని గట్టిగా భరవసా ఇచ్చింది. అయినా హేమసుందరి అంగీకరించలేదు. ఆపైన వద్దు వద్దంటున్నా లక్ష్యపెట్టక ముత్యాలు బలవంతంగా ఆ ఉంగరం హేమసుందరి చిటికెనవేలి కలంకరించింది. పైగా తిరుమలరెడ్డి మరికొన్ని రత్నాభరణాలు బహూకరించగలడని ఆశపెట్టి ప్రోత్సహించింది.

అంతలోనే ఆమె ఆ ఉంగరం తీసి తిరిగి ముత్యాల చేతి కందియబోయింది. 'ఇది నీ వేలికెంతో చక్కగా అమరింది! వద్దు! వద్దు! ఉండనీ!' అని బలవంతంచేసి, పిడికిలి అదిమి పట్టి ఒక్క అంగలో ఆమె అక్కడినించి వెళ్ళిపోయింది! అది తన దగ్గర ఉంచుకోవడం హేమసుందరి కేమాత్రము రుచించలేదు! అయినా ఆమె మాట లక్ష్యపెట్టక ముత్యాలు తుర్రుమని వీధిలోకి


అందాన్ని
బయటకు
తెస్తుంది...
Lakmé

వెళ్లిపోయింది. 'ఇక ఆ ఉంగరం ఏమిచెయ్యాలి?' అని హేమసుందరి రవంతసేపాలోచించింది. నాంచారమ్మద్వారా అది తిరిగి ముత్యాలు దగ్గరికి పంపించి వెయ్యాలని నిశ్చయించింది. కాని అంతలోనే ఒక కొత్తి ఉపాయం స్ఫురించింది!

మరు క్షణంలోనే తల్లితో కలిసి గోపాలస్వామి దేవాలయానికి వెళ్లిన మాణిక్యవల్లి తిరిగి వచ్చిందేమో అని ఆమె గదిలోకివెళ్లి చూసింది. అప్పటికింకా ఆమె తిరిగి రాలేదు. అలాగే మరికొంత సేపు నిరీక్షించి కొంచెం గొంతెత్తి 'నాంచారూ!' అని పిలిచింది. ఇంటిలో ఎక్కడో పనిచేసుకుంటున్న ఆ దాసి అది విని అక్కడికి వచ్చింది.

'పిలిచారా! అమ్మా!'

'మా అమ్మ, అక్కయ్య ఇంకా తిరిగి రాలేదేమే!'

'వచ్చేవేళయిందమ్మా!'

'అవునుగాని, ఆయన కెలాగుందో కనుక్కున్నావా?'

'కనుక్కున్నానమ్మా! కొంచెం లేచి అటు ఇటు తిరుగుతున్నారట!'

హేమసుందరి మరికొంత సేపటివరకు అలాగే ఆమెవైపు చూసి తన మనోవేదన వెళ్లబోసుకొన్నది.

'నాంచారూ! ఆయన ఈమధ్యన మన భవంతి వైపే రావడం మానుకున్నారేమే! నా మీదగాని దయ తప్పలేదుగదా!'

'అదేమిటమ్మా! అలాగంటారు! ఇప్పుడిప్పుడే గదా, కొంచెం లేచి అటు ఇటు తిరుగుతున్నారు! అప్పుడే యిటువైపు రాగలరా? అదీగాక ఆయన తండ్రిచాటు బిడ్డ! తిరుమలరెడ్డిగారు వచ్చినట్టు బరితెగించి రాగలరా?'

'ఎల్లాగయినా ఒక్కసారి ఆయనతో మాట్లాడాలని ఉందే!'

హేమసుందరి కంఠంలో గద్గదిక తొణికిసలాడింది. నేత్రాంతాలలో వేడివేడి కన్నీటి బిందువులు రెండు చిన్న మంచి ముత్యాలై తరలించాయి. ఆ ధోరణి గమనించి నాంచారమ్మ నెమ్మదిగా ఓదార్చింది:

'మీ కింతటి బెంగె లెందుకమ్మా! మళ్లీ శుక్రవారంనాడు మీ అమ్మగారు, అక్కయ్యగారు స్వామి దర్శనానికి వెడుతున్నారుగదా! ఇప్పటినించి ఆలోచిస్తే అప్పటి కేదయినా ఉపాయం తోచక పోతుందా? అన్నట్టు అవేళ స్వామి పవళింపుసేవ కాదూ? అందుచేత—'

నాంచారమ్మ ఇంకా ఏమేమో చెప్పబోయింది. అంతలోని భవంతి వీధి గుమ్మంలో అడుగుల సవ్వడి వినబడింది. ఆమె ఉలికిపడి అటువైపు చూసింది. శృంగారమంజరి, మాణిక్యవల్లి అల్లంతదూరంలో కనిపించారు. వెనువెంటనే ఆమె అక్కడినించి వెళ్లిపోయింది. అక్క లోపలికి వచ్చి తన గదిలో ప్రవేశించగానే హేమసుందరి నెమ్మదిగా ఆమె ననుసరించింది.

మాణిక్యవల్లి చెల్లెలి ముఖవైఖరి పరిశీలించి 'ఇదేమిటే ఇలాగున్నావీవేళ?' అని విస్తుపోయి నిలుచున్నది. 'ఏమీలేదు!' అని హేమ ఒక చిరునవ్వు చిందించి గదిలోపలికి వెళ్లి తలుపు గొళ్లెం పెట్టింది. మాణిక్యవల్లి మరింతగా కంగారుపడి నెమ్మదిగా నిమ్మకి నీరెత్తినట్టు అడిగింది:

# విశాలనేత్రాలు

'ఏమిటే విశేషం హేమా? తలుపు లెందుకు బిగించావు?'

'ఈ వేళ నా మీద బాగా పెద్ద బెడదే విరుచుకు పడింది.' ఉసూరుమని నిట్టూర్చింది హేమసుందరి.

'ఏమిటది?' తీవ్రంగా బొమ ముడివేసింది మాణిక్యవల్లి.

'ఇదిగో! నీకే తెలుస్తుందిలే! చూడు' వేలి నున్న ఉంగరం తీసి అక్క చేతిలో ఉంచింది. మాణిక్యవల్లి దాని రత్నాలకేసి బాగా పరిశీలనగా చూసి ఆశ్చర్యపడి అడిగింది.

'ఇది ఎక్కడినించి వచ్చింది?'

'తిరుమలరెడ్డి ముత్యాలు ద్వారా పంపించారు.'

అది విని మరింతగా ఆశ్చర్యపడి ఎంతో సంతోషించింది మాణిక్యవల్లి.

'ఓహో! అలాగా! ఆయన నా బహుమానం మాటే మరిచిపోయా రనుకున్నాను! తిరిగి ఇంకొకసారి జ్ఞాపకం చెయ్యా లనుకున్నాను గాని కొంచెం బెట్టుసరి చెయ్యాలని మాట్లాడకూడ

---

తండ్రీ కొడుకూ పెళ్ళికెళ్తే తాంబూలం అరటిపండు ఇచ్చారు. కొడుకు: నాన్నా నాన్నా నాకు అరటిపండియ్యి నువ్వు, వక్కతీసుకో. తండ్రి: "మరి, అమ్మకో?"

"అమ్మకు విడకులిచ్చేయ్" అన్నాడు కొడుకు.

పి. జీవిక (రాజమండ్రి)

---

కున్నాను! అయితే ఏదో పెద్ద బెడద విరుచుకు పడిందంటావేమిటి?'

ఆ ఉంగరం తన వేలికి పెట్టుకున్నది మాణిక్యవల్లి. అంతలోనే హేమసుందరి అసలు రహస్యం బయటపెట్టింది:

'ఇది నీకోసం కాదక్కా!'

'మరి ఎవరికోసం? నీకోసమా?'

'అవును నా కోసమే పంపించారు.'

ఆ సమాధానం విని వినగానే మాణిక్యవల్లి నిశ్చల శిలాప్రతిమలా నిర్ఘాంతపడింది! అంతలోనే హేమసుందరి ముత్యాలు చెప్పిన మాటలన్నీ పూస గుచ్చినట్టు అక్క చెవిలో ఏకరువు పెట్టింది. అంతే! ఇక మాణిక్యవల్లి ముఖంమీద కత్తివాటు వేసినా నెత్తురుచుక్క లేదు. మరికొంతసేపటి వరకు ఆమె అలాగే నిలబడి ఉసూరుమని నిట్టూర్చి బాగా దిగాలుపడి పక్కనే ఉన్న పందిరి పట్టె మంచంమీద కూలబడింది. 'అయ్యో! నమ్మించి నమ్మించి చిట్టచివరి కెంత ద్రోహం తలపెట్టారే!' అని సన్నని బుడి బుడి దీర్ఘాలు ప్రారంభించింది. హేమసుందరి ఆమె సరసనే కూర్చుని ఎంతో ఆత్మీయతతో బ్రతిమాలుకొన్నది:

'నమ్మ! నమ్మకపో. ఎంత ఒట్టు పెడితే అంత ఒట్టు! ఇందులో నేను ఏ పాపము ఎరగనక్కా!'

'అవునుతల్లీ! నిజమే! నిన్నుకాదు నే నన్నది! ఆయన తలపెట్టిన ద్రోహం మాటే ఆలోచిస్తున్నాను.'

మరి కొంతసేపటివరకు అక్కా చెల్లెళ్లిద్దరు ఆ వ్యవహారాన్ని గురించి అనేక విధాల మథన పడ్డారు. రెడ్డి సంగతి తెలుసుకుని హేమసుందరి అంతగా ఆందోళన పడలేదు. కాని మాణిక్యవల్లి కది అంతా ఒక పెద్ద పాడు పీడకలలా కనబడింది. ఆ సంఘటనతో రెడ్డి అంతర్యం ఆమె కామూలాగ్రంగా అవగత మయింది. లోలోపల ఎడతెగని గుంజాటన ప్రారంభమయింది.

పైపైకి ఏదో అభినయిస్తున్నా డన్నమాటే గాని రెడ్డి మనస్సు పూర్తిగా హేమసుందరివైపు తిరిగింది! ఇక సందేహంలేదు. మరి కొన్నాళ్ళు గడిచిన తరువాత ఆయన ఇక తన మాటే తలపెట్టక పోవచ్చును! చెల్లెలి కీనాడు రంగనాయకుని మీద వల్లమాలిన మమకారమే ఏర్పడిఉండవచ్చును. కాని అతగాడింకా తండ్రిచాటు బిడ్డ. కనక ఏదయినా గట్టి అవాంతరం వస్తే హేమసుందరి మాటే తలపెట్టక మాట్లాడ కూరుకోవచ్చును. ఆమె ఆపైన ఎంతకాలమని అతనికోసం కనిపెట్టుకుని కూర్చుంటుంది? కనక ఈ వేళ కాకపోతే రేపయినా హేమసుందరి మనస్సు మారవచ్చును. అది కనిపెట్టి రెడ్డి క్రమక్రమంగా చెల్లెలిని లోబరుచుకోవచ్చును. అప్పుడు తన గతి ఏం కావాలి? అయితే హేమసుందరీ రంగనాయకు లిద్దరు ఏకీభవించి ఒక తాటిమీద నిలబడగలిగితే తన ప్రస్తుత ప్రమాదం తప్పిపోవచ్చును. కాని లోకంలో వ్యవహారాలన్నీ సరిగా తా ననుకొన్నట్టే జరగగలవన్న నమ్మక మేమిటి?

ఏది ఏమయినా హేమసుందరి తనకింట కంటబడినంతకాలము రెడ్డి ఇంకొకరి మాటే తలపెట్టడు! దీని కేమిటి దారి? చెల్లెలిని చల్లచల్లగా ఇంకొకచోటి కెక్కడికయినా సాగనంపివేస్తే? అయితే అది రంగనాయకుని అనురాగంమీద ఆధారపడిన విషయం! అతగాడు గాని గట్టిగా తలుచుకుంటే హేమసుందరి నింకొకచోటి కెక్కడికయినా వెంటబెట్టుకొని పోగలడు! కాని రంగనాయకు డంతటి దుస్సాహసాని కొడిగట్టగలడా? కలలో మాట! లేనిపోని పేరాసతో ఉబలాట పడడమే గాని అది ఎన్నటికీ జరగనేరదదు! ఒకవేళ తెగించి దాని కతడు సిద్ధపడినా చెల్లెలిక ముందు వెనక లాలోచించక అతని వెంటబడి పోగలదా? అదీ సందేహమే! కాని ఇప్పటి ధోరణిని పట్టి చూస్తే రంగనాయకుని కోసం కళ్లు మూసుకుని కావేరి మడుగుండంలో దూకడానికయినా వెనుదీయునట్టే కనిపిస్తున్నది! కాని రంగనాయకు డిటీవల గోపురంమీదికి వస్తున్నట్టే కనబడడం లేదే! అత డెందుచేత రావడంలేదో! ఇంటిదగ్గర ఏదయినా పెద్ద గొడవ జరిగిందేమో! అందుచేత అతడిక హేమసుందరిమాటే తలపెట్టడం మానుకొన్నాడేమో! ఆవిధంగా ప్రాణాపాయాని కయినా వెనుదీయక అర్ధరాత్రివేళ చెల్లెలి కోసం వచ్చిన వ్యక్తి ఆమె నంతలోనే మరిచిపోగలడా? మాణిక్యవల్లి మనస్సులో ఆలోచన లావిధంగా మెరుపుల్లా సాగిపోయాయి.

# విశాలనేత్రాలు

అంతలోనే హేమసుందరి కొక కొత్త ఉపాయం స్ఫురించింది.

'అప్పనుగాని, అక్కా! ఈ ఉంగరం సంగతి అమ్మతో చెబితే!'

మాణిక్యవల్లి ఉసూరుమని నిట్టూర్చింది. 'అయ్యో! వెర్రిదానా! అంతమాత్రంచేత అమ్మ రెడ్డి కడ్డువడగలదనుకొన్నావా? మొట్టమొదట చూచీ చూడనట్టు మాట్లాడక ఊరుకుంటుంది. ఆపైన ఒడినిండా ధైకం గుమ్మరిస్తే, మరి ఆయన్ని మించిన మహారాజా ఇంకెవడు దొరకడను కుని ఎగిరి గంతేస్తుంది! రెడ్డి ఆడిన ఆటలకన్నింటికీ పక్కతాళం వేస్తుంది. చిట్టచివరికి జరిగేదింతే!'

ఆ సమాధానంతో హేమసుందరి దిగాలుపడి చెక్కిలిపై చేయి చేర్చి దీర్ఘాలోచనలో పడింది. అంతేగాని మరి మాణిక్యవల్లితో మాట్లాడలేదు! ఆ నైరాశ్యధోరణి గమనించి అక్క ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది.

'పిచ్చి! హేమా! దీనికింత మథన ఎందుకు? ఏదిఎలాగ జరగవలసి ఉంటే అలాగే జరుగుతుంది! మనమేమి చెయ్యగలం! ఇంతకీ ఆయనకి నీమీద అంతటి వల్లమాలిన వ్యామోహం కలిగినప్పుడు ఎన్నెన్ని విధాల బాధపడినా ప్రయోజనం లేదు! అంతే! ఆ ఉంగరం నీ వేలినే ఉండనీ!'

మాణిక్యవల్లి తిరిగి ఆ ఉంగరం హేమసుందరి కందియబోయింది. కాని ఆమె దూరదూరంగా వెళ్ళి ధుమధుమ లాడింది:

'వాల్చాల్చే! నేనిది వేలికి పెట్టుకుని తగుదు నమ్మా అని రెడ్డి కంట పడతా ననుకున్నావా? ఏది ఏమైనా సరే, అది ఎన్నటికీ జరగదు! నువ్వు గాని బలవంతంగా నా వేలికి పెట్టావంటే, దాని వజ్రప్పొడి నోటిలో వేసుకుని ప్రాణం విడిచి నేల మీద కూలిపోతాను! తెలిసిందా! దానితో నాకే కవి పీడ అంతా విరగడైపోతుంది! అంతే!'

మాణిక్యవల్లి సరిగా అటువంటి సమాధానం కోసమే ఎదురుచూచింది. చెల్లెలి నెంతో ఆప్యాయంగా కౌగిలించుకుని చెవిలో ఊదింది:

'శుభమల్లే ఎందు కలాంటి మాట అంటావు! నీ కిష్టం లేకపోతే నేను మాత్రం బలవంతం చేస్తానా? సరేగాని ఆ రంగనాయకుడి సంగతి ఏమయినా తెలిసిందా?'

'ఏమి తెలియలేదక్కా!'

"ఒకసారి ఎక్కడయినా అతిరహస్యంగా కలుసుకుని ఈ గొడవలన్నీ ఆయన చెవిని వేస్తే?"

"నేను అదే ఆలోచిస్తున్నాను. కాని ఎలాగ? అమ్మకిగాని తెలిస్తే ఇక నన్ను బతకనిస్తుందా?'

మాణిక్యవల్లి మరికొంతసేపు ఆలోచించి చల్ల చల్లగా చెల్లెలి నోదార్చింది:

'నీకేమి భయంలేదు! నే నున్నానుగా! ఒకసారి నాంచారమ్మతో చెబితే సరి! ఇక రెండో కంటివాడి కెవడికీ తెలియకుండా భద్రంగా తీసుకురాదిస్తుంది. ఆపైన నీ అదృష్టం పండి, ఆయన ఇష్టపడితే, ఇద్దరూ కలిసి మాట్లాడుకోవడానికి దారి దొరకదా?'

ఆ ప్రసంగం విన్న తరువాత హేమసుందరి హృదయంలో అకస్మాత్తుగా ఒక ఆశాజ్యోతి అనిర్వచించి తళుక్కుమని మెరిసింది! (ఇంకా ఉంది)

జీసస్‌కు ఈ విషయంలో ప్రమేయం లేనట్లు నిశ్చలంగా నిర్వికారంగా మౌనంగా ఏదో ఓ అతీంద్రియమూ అలౌకికమూ అయిన శక్తిపై మనస్సు లగ్నం చేసి ధ్యానం చేస్తున్నట్లు నిలబడిపోయాడు.

అతిజాగ్రత్తగా చాతురితో లూసియస్ ఇచ్చే సమాధానాలు పిలేట్‌ను విసుగెత్తించాయి. ఎంత వాగ్యుద్ధం జరిగినా పాము చావక కర్ర విరగకుండా నడుస్తోందాయ్ వాదము. ఆఖరికి పిలేట్ జీసస్‌నే ప్రశ్నించాడు.

"అయితే నువ్వు రాజావేనా?

## కింగ్ ఆఫ్ కింగ్స్

ఎంతో వ్యాఖ్యానానికి వీలుగా అడిగినమాట అది. ఇంతసేపటి వరకు మౌనంగా ప్రాపంచిక విషయసంబంధం లేనట్టున్న జీసస్ సమాధానం చెప్పాడు. "నా రాజ్యం భగవంతుని రాజ్యం మాత్రమే."

పిలేట్ ఎలాగైనా ఒప్పించాలనుకున్నాడు. "ఓహో! నువ్వు రాజువే నన్నమాట?"

"ఆమాటన్నది మీ పెదవులు. నేను కాదు. నేను భూమి మీదికి వచ్చింది సత్యంలో నమ్మకం గల వారికి దాన్ని గురించి బోధించేందుకు మాత్రమే."

"ఏమిటా సత్యం?"

జీసస్ ఓ దీర్ఘ ఉచ్ఛ్వాసం తీసుకున్నాడు. "మీ ఆత్మ సత్యమని నమ్మినదే సత్యం."

"ఇక్కడు మనం విచారించేది నాజరెత్‌కు చెందిన జీసస్ అనే వ్యక్తినిగాని సత్యాన్ని కాదు" లూసియస్ గంభీరస్వరం వారి సంభాషణకు అంతరాయం కల్గించింది.

(ఇంకా ఉంది.)

"కాదు రమా! ఇవ్వాళ కేసొకటి ఫెయిలయింది. చాల పేథటిక్ స్టోరీ అనుకో, ఆ అమ్మాయిది ...." శేఖర్ దిగులుగా చెప్తున్నారు.

రమ శేఖర్ మొహంలోకి చూస్తూ వింటున్నది.

"వంటికి ఏమైనా జబ్బయితే చేసిన ప్రయత్నానికి ఫలితముండునేమో రమా, కాని ఏం చెయ్యను రమా, మందులతోను, మంచి మాటలతోను పోయే జబ్బుకాదు .... ఆ అమ్మాయిది" కాఫీ తాగి గ్లాస్ టేబుల్‌పై పెడుతూ.

"ఆయినా ఆడవాళ్ళ మనస్సులు మరీ సున్నితం కదా. మనసు నెవరికో శాశ్వతంగా ప్రసాదించడం, ఆతనెవరో తనవారి తాను మానుకుంటే .... కుళ్ళి కుళ్ళి కృశించిపోయి, ఇంక తన కెవరూ లేనట్లు, అతనే తన సర్వస్వమనుకొని, తల్లిదండ్రులను కూడ పరాయివారిగా తలంచుకొని చివరకు ప్రాణాలు త్యజించటం .....". ఏమిటేమిటో శేఖర్ విషాదంగా చెప్పుతున్నాడు.

ఇంతలో, "శేఖర్ బాబుగారండీ, ఉన్నారండీ" అనే పిలుపుని, రంగయ్యమాట విని ఎవర్రా అంటూ శేఖర్ లేచాడు. ఇంతలో శేఖర్ నెవ్వరో ఇద్దరు వ్యక్తులు హుషారుగా లోపలి కొచ్చేప్పటికి రమ చరచరా లోపలికి వెళ్ళిపోయింది.

* * *

రమ తల్లి లేని పిల్ల కావడంచేత రమను చిన్నప్పటి నుంచి వాళ్ళ పెద్దమ్మగారు తనదగ్గరే ఉంచుకొన్నారు. రమా, రాజన్నా చిన్నప్పుడెంత బాగా ఆడుకొనేవారు! అన్నయ్యా తనూ ఒకటే పోట్లాటలు. అన్నయ్య మాటిమాటికి కొడుతుండేవాడు తనను. తను ఊ అంటే చాలు అలుగుతుండేది. పెద్దమ్మ అన్నయ్యను తిట్టేది. అన్నయ్య చిక్కమొగం వేసేవాడు. తనకు జాలేసేది. మళ్ళా అన్నయ్య జట్టు కెళ్ళిపోయేది. నవ్వుకుంటూ హాయిగా తిరిగొచ్చేవారు. ప్రొద్దుట లేచి కాఫీ త్రాగి టిఫిన్ తిని జట్టు లేసుకొని స్కూలు కెళ్ళేవారు. మళ్ళా వచ్చి ఆటలు, కొట్లుకోటాలు, గిల్లుకోటాలు, అలకలు.

## మహాగబాధ

24 వ పేజీ తరువాయి

రాజన్నను విడిచి తా నుండలేకపోయేది. చిన్నతనం అలా గడిచిపోయింది. అన్నయ్య కాలేజి హైస్కూల్లోను తను మునిసిపల్ గర్ల్సు హైస్కూల్లోను చేరారు.

వాళ్ళ అప్పుడప్పుడూ వచ్చి చూసిపోతూ సెలవల్లో తలుకు తీసికెళ్ళిపోయేవారు. అక్కడ వాళ్ళకు పెద్ద మేడ, రేడియో, అన్నీ ఉన్నాయి. ఐనా ఏం బాగుండేదికాదు. వారోజులుండి అన్నయ్యను రమ్మని ఉత్తరం రాసేది తను. అన్నయ్యొచ్చేవాడు. ఇద్దరూ కలిసి కాకినాడ వచ్చేసేవారు. అన్నయ్య వాళ్ళ స్కూలుగొడవలు ఒకటే చెప్పి నవ్వించేవాడు. అబ్బాయిలు, అమ్మాయి ఏడిపించడం, వాళ్ళ పిల్ల నేడ్పించడం, పిల్లంతా మేష్టర్ల నేడ్పించడం ఒకటేమిటి. పిల్లలో ఒక హీరో, ఒక సినిమా అమ్మాయిల్లో ఒక హీరోయినూ క్లైడు హీరోయినూ...ఏవేవో చెప్పేవాడు. తనది కో ఎద్యుకేషన్ కాదేమో అన్నయ్య చెప్పే కబుర్లు వింతగా ఉండేవి. అలా హైస్కూలు చదువులు ముగిసిన తర్వాత ఇద్దరూ పి. యు. సి. లో జాయిన్ అయ్యారు. పి. యు. సి. కి వెళ్ళేటప్పుడు గ్రూప్ సెలక్షన్లో తను సైన్సు తీసుకుందామన్నయ్యా ఇద్దరం కలిసి చదువుదా మంది.

"ఛట్! ఆ సైన్సు నాకు గిట్టదు. నువ్వు చదువుకోలే, సైన్సు, నేను ఆర్ట్సు చదువుతా" నన్నాడు. అలాగే ఇద్దరూ రెండు గ్రూపులూ చదవడాని కంగీకరించి కాలేజిలో చేరారు. అబ్బాయిలతో కలిసి చదవడం కొత్తగా ఉండి తను బెరుకు బెరుగ్గా ఉండేది.

అన్నయ్య హైస్కూల్లో కంటే కాలేజి జీవితంలో ఇంకా హుషారుగా ఉండేవాడు. హైస్కూలు కన్నా కాలేజి జీవితం "హాయి" అనేవాడు.

వాళ్ళ క్లాసులో వచ్చేనిమిదిమంది అమ్మాయిలు, అట! శేమనైక్కువేనంట కాని ఏం జాణ్యులంట. వాళ్ళందరకు వాళ్ళు పెట్టే పేర్లు, వాళ్ళ తెలుగు మేష్టారు రాగాలు, ఇంగ్లీషు మాష్టారు డిగ్నిఫైడ్ స్పీచ్, ఏమేమో చెప్పేవాడు.

అన్నయ్యకు ఇంగ్లీషంటే చాల ఇష్టం. మాటకీ ఏవేవో కొటేషన్లు చెప్పేవాడు.

"రమా! మా 'పరీక్షిణ' లేదూ!"

"ఎవ రన్నయ్యా ?"

"అబ్బ ఎవరైతే నేం? "

"ఊఁ"

"పరీక్షిణకు ఇంగ్లీషంటే నవ్వు రమా"

"ఆవ్. అన్నయ్యా! పరీక్షిణంటే పేరేనా ?"

"పిచ్చి తల్లి! పరేదానివే. "నిక్‌నేమ్" రమా! నిక్‌నేమ్!"

"పరీక్షిణ." అదేంటన్నయ్యా ఎందుకు పెట్టారా పేరు.

"ఆఁ ఆఁ ఏముంది. ఊహుఁ, ఎందుకో నిక్ క్లీన్స్ నవ్వుట్లు మాసిడంటుంది ఎప్పుడో — అంతే, ఎవడో ఆమాట అనేశాడు. అంతా అదేగా అంటారు"

"అయినా ప్రపో దెవడికీ తెలుసు పోదూ!"

"ఇవాళ మాకు తెలుగుసరు చాల అద్భుతం, అమోఘంగా జరిగిం దనుకో."

"ఏమిటి విశేషం ?"

"రాగంతీస్తున్నా డా రసంగారు. ఎవడో వెనక రాగంతీశాడు. వెధవల్లారా వినండ్రా అంటాడు. నువ్వే వంటూ లేచిపోయూ రో పదిమంది హీరోలు. అక్కడ్నుంచి నానా హంగామా .... క్లాసు కేన్సిల్ అయిం దని "

"అయినా అదేం టన్నయ్యా అంత అల్లరి మరీను. మాష్టారికూడా పెద్దే."

"అందులోనే ఉంది మరి అందం ఆనందం.... ఏంటేంటో మరి చావడంలేదు కవిత్వం ...."

ఇద్దరు నవ్వుకొనేవాళ్ళు.

* * *







# మూ గ బా ధ

షంగా ఉంటారేమో అనుకొంటే మీరు మరీ అలా అయిపోతే ఎలా చెప్పండి?"

అత్తయ్య మళ్ళా మీకోసం బెంగపడుతున్నారు. "రమ మాడు వాయనా కుళ్ళిపోతోంది. అది కూడా నన్నన్యాయం చేస్తుందేమో" అంటున్నారు.

రమ కన్నీరుకారుస్తూ అలాగే నిలబడింది.

"చూడండి రేపట్నుంచి కాలేజీకి వెళ్ళండి. కాలేజీకి వెళ్తే కొంచెం బాగుంటుంది. వెళ్తారు కదూ !"

"........"

"వెళ్తానండీ .... ! తప్పకుండా రేపు కాలేజీకి వెళ్ళండి నేం ?"

ఎంత పెద్దవాడిలా చెప్పాడు. ఆనాడు అల్లరి చేసిన మధేనా .... అనిపించింది.

* * *

రమ కాలేజీకి వెడుతుంది. కాని అన్నయ్యపై బెంగ పోలేదు. సాయంత్రం ఇంటికొస్తే అన్నయ్య గురించే ఆలోచనలు. పెద్దమ్మ చిక్కి శల్యమై పోయారు. మధు రోజూ సాయంత్రం వచ్చి ఏవేవో కబుర్లు చెప్పేవాడు. నవ్వించేవాడు. రమకు బెంగ పోడానికై అన్నివిధాలా ప్రయత్నించేవాడు. కాలేజి కబుర్లు, సినిమా కబుర్లు, రాజకీయాలు, విమర్శలు ఏవేవో చెప్తూ ఉండేవాడు. మధు వచ్చిన కాస్సేపు ఇల్లు కలకల్లాడేది.

మధంటే పెద్దమ్మకు ప్రాణం. రమకు మధు దగ్గర చనువేర్పడింది.

* * *

"రమా. . . !" మధురంగా ఉంది కంఠం. అన్నయ్యపిలుపు జ్ఞాపకం వచ్చి దిగులనిపించింది.

"రమా .... !" మళ్ళీ పిలిపించుకోవా లనిపించింది. పక్కమీదనుంచి లేచి తలుపుతీసింది.

"లోప లేంచేస్తున్నావు రమా .... ఏడుస్తున్నావా ?"

ఏమిటోయింత చనువుగా మాట్లాడేస్తున్నాడు. రమను "రమా" అని పిలవడం ఇదే మొదలైనా కొత్తగా ఫీలయినట్టయినా లేదు, అనుకొని,

"ఏం లేదండి" అందిరమ.

రమ లోపలికి వచ్చి కుర్చీలో కూర్చుని హాంకీతో మొహం తుడుచుకొంటూ "చూడు రమా!"

"ఒక వ్యక్తి మరో వ్యక్తిని తన అతి సన్నిహితులుగా భావించాడనుకో"

". . . ." రమ మధువేపు చూస్తోంది.

"అప్పుడవతలివ్యక్తి ఇతరస్నేహితులో పరాయి వారిగా తలచి దూరదూరంగా ఉంటే ఈ మనిషి కేమనిపిస్తుంది."

"బాధనిపిస్తుంది."

"కానీ .... అప్పు డవతలి వ్యక్తికూడ తనకు ఇష్టంలేకపోయినా .... ఈమనిషి ఆత్మసంతృప్తి కోసమైనా సన్నిహితంగా మాట్లాడొచ్చుగా."

"ఊఁ"

"రమా ...." పెద్దమ్మ పిలుపు.

"అమ్మా !"

"ఎవరమ్మా."

"మధుసూదనరావుగా రొచ్చారమ్మా."

"మధోచ్చాడా ! ఎప్పుడొచ్చావు నాయనా !"

"ఇప్పుడే అత్తయ్యా .... వస్తున్నానుండు."

"రమా నే విచ్చిన ఉపోద్ఘాతమెందుకో తెలిసిందా ?"

"........"

"దయచేసి నన్ను మధూ అని పిలు. అది నీకూ ఉచ్చారణ సౌలభ్యం. నాకు .... " లేచి వెళ్ళిపోయాడు.

ఏమిటీ మధు, మరీ చను వెక్కువైపోతోంది. అనుకొంది రమ. అయినా తనెలా పిలవాలి మధూ అని. ఊహూఁ పిలవను. పిలిస్తేనేం .... ఏమిటో.

* * *

"రమేదత్తయ్యా!"

"ఇంట్లో ఉంది మధూ" అదేమిటో కాలేజీనుంచొచ్చి కాసేపైనా హుషారుగా ఉండదు ....."

"నే మాట్లాడిస్తాలే అత్తయ్యా" అంటూ లోపలి కొచ్చేసాడు.

"రమా!"

"ఏమిటి మధూ" ధైర్యం కూడగట్టుకుని చివరి రెండుమాటలూ అంది.

మధుమొహం విప్పారింది. ఇదా ఏమీ తెలియకుండా,

"అరే మీకు మాట్లొచ్చా. ఊహూఁ రావను కొన్నా. అత్తయ్య మీకు కబుర్లు నేర్పించడానికో ట్యూటర్ని పెట్టాలనుకొంటున్నారు. ఒద్దని చెప్తానండి పాపాయిగారూ .... ఏది .... ఇల, ఈగ, ఉడుత, ఊయల ...."

రమ నవ్వేసింది.

ఆరోజు పెద్దమ్మ ఏదో సంబంధాలు, చుట్టరికాలు ఏవేవో చెప్పుకొచ్చి చివరకు మధు మన బంధువే నన్నారు. అహా అలాగా అంది రమ. ఈ విషయం తెలిస్తే మరీ ఇంట్లో మనిషై పోయేలా ఉన్నాడు.

అయినా మధుతో ఇంతింత చనువు కూడదేమో కొంచెం దూరంగా ఉండాలనుకొంది.

"పెద్దమ్మా మధు మన చుట్టమని మధుకు తెలుసా."

"తెలుసే. ఎందుకు తెలియదూ. నేనేగా అడిగాను మొదట వాళ్ళ ఎవరబ్బాయివని. అప్పుడే చెప్పాను వాడికి."

"ఊహుఁ."

* * *

రమ వరండాలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతోంది.

మధు వచ్చి పక్క కుర్చీలో కూర్చున్నాడు.

రమ కావాలనే పలుకరించలేదు. ఏమిటో మధుతో చను వెక్కువయ్యేకొద్దీ ఏదో బెంగగా ఉంటుంది. ఈ చనువే నన్ను మధునుంచి దూరం వెయ్యలేనిదిగా మారుతుందేమో అనిపిస్తుంది.

"ఏమిటి రమా చదువుతున్నావు ?"

రమ పుస్తకంలోనే చూపునుంచి ఏదో చెప్పింది.

మధు కాసేపు కూర్చుని "నే వెడతాను రమా" అని లేచి వెళ్ళిపోయాడు.

రమ కెందుకో బాధనిపించింది. కాసి మాట్లాడితే ఏం పోయె అనుకుంది.

## మూగ బాధ

"కన్నీరు పెట్టుకుంటున్నావు మధూ" అంటే "అవును రమా! నిన్నిప్పుడో కవికి చూపిస్తే .... ఒక మహత్తరమైన కథను వెలువరిస్తాడు. ఆ కళ్ళల్లో ...."

ఎందుకో శేఖర్ మాటల్లో మధు గుర్తుకొచ్చాడు. పెద్దమ్మకు ఉత్తరం వ్రాసి కనుక్కుందామంటే .... ఏమిటో .... అభిమానానికి అలా ఉండిపోయింది.

పెద్దమ్మ దగ్గర్నుంచి ఉత్తరం వస్తే మధువిశేషాలు గురించే వెతికేవి కళ్ళు. కాని పెద్దమ్మ మధునుగూర్చి ఏమీ వ్రాసేదికాదు. ఒకరోజు పెద్దమ్మ దగ్గర్నుంచి ఉత్తరం వస్తే తానేమి ఆత్రత లేకుండానే విప్పింది.

ప్రియమైన రమకు పెద్దమ్మ దీవించి వ్రాయునది—

రమా, నావల్ల చాల అన్యాయం జరిగిపోయిందమ్మా. మధు నీ పెళ్ళి విషయం తెలుసుకొని పిచ్చివాడైపోయాడు. నువ్వు బాధపడతావని ఇంతవరకూ నీకీవిషయం వ్రాయలేదు. ఇంటిలో వెతుక్కుంటున్నట్లే నడిచేవాడు. ఏమిటి మధూ అలా ఉంటున్నావంటే ఏమీలే దత్తయ్యా అనేవాడు. నాకు మీ ఇద్దరిమధ్య ఇంతటి అనురాగం నెలకొని ఉందని తెలిస్తే ఇంతవరకూ రాకపోవును. అయినా విధి అలా లిఖించాడేమో. నీ పెళ్ళివిషయం లేమీ మనమింకా అనుకోనందే నీ పెళ్ళి కుదుర్చుకొని మీ నాన్న రావడమేమిటి? మధు పిచ్చిపిచ్చిగా ఉంటూనే, ఉన్నట్టుండి ఇంటికి వెళ్ళాడు. అక్కడ జ్వరం తగిలిందని .... ఎవరో డాక్టరు ట్రీట్ చేస్తున్నాడని అమధ్య నాకు ఉత్తరం రాసాడు. నిన్ననే వాళ్ళ నాన్నగారు ఉత్తరం రాసారు. మధు మొన్న శనివారం పోయాడట ......"

ఇంకా ఏవేవో విశేషాలు రాసిఉన్నాయి. అక్షరాలు కనిపించలేదు. కళ్ళు తిరిగిపోయాయి. "మధూ .... నావలన నీ జీవితానికే అన్యాయం జరిగిపోయింది. నన్ను క్షమించు. నేనొక అస్వతంత్రను. నిన్ను దక్కించుకోలేకపోయాను .... బావురుమని ఏడవడానికికూడ నోచుకోలేదు రమ. కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. తన బాధ నెవరికి చెప్పుకోగలదు. ఏమని చెప్పుకోగలదు. "నీ సర్వస్వం అనుకొనే సొత్తు పరాయివారికి చెందిపోతే తీరని ఆవేదనతో మరణించావా .... ఏమనుకొన్నావు నన్ను గూర్చి. ఒక కఠినాత్మురాలననుకొన్నావా .... మధూ నిన్ను కడసారి ఎప్పుడు చూశాను. నిన్ను విడిచిపోతున్నానని పిలవుకూడా తీసుకోలేదే .... నా మనసున మల్లెలు పూయించిన మధు. మన కథ ఒక కలయ్యిపోయిందికదా...."గుండెలు పిండేసేబాధ.

అన్నీతలంచుకొని రమ వెక్కి వెక్కి ఏడుస్తుంది.

"రమా! రమా! ఏమిటి! ఏడుస్తున్నావా. నీ మనసు మరీ మెత్తన. అందుకనే నేనేమీ చెప్పను..... లే .... లే అంటూ రమను మంచంమీద నుంచి లేపి కళ్ళు తుడిచి, ఏమిటి రమా! 'నవ్వూ, నవ్వాలి" అన్నాడు.

గుండెలుతరిగే వేదనను మనిలోనే మూగబాధగా కలిచివేస్తుంటే శేఖర్‌నుచూసి నవ్వుకోలుగానవ్వింది. ★



"స్వర్ణమంజరి"లో ఒక దృశ్యం.

## చిత్ర సమీక్ష:

# ట్రిక్ ఫొటోగ్రఫీలో మరో మెట్టు: "స్వర్ణమంజరి"

నిర్మాత, సంగీతం: శ్రీ ఆదినారాయణరావు. అంజలీ పిక్చర్స్. మాటలు: శ్రీ మల్లాది; పాటలు: శ్రీ సముద్రాల; దర్శకత్వం: శ్రీ వేదాంతం. ఛాయ: ఆదియిరానీ, మహేంద్రాని. నటీనట బృందం: అంజలి, రామారావు, నాగయ్య, కన్నాంబ, రాజనాల, జయంతి, పేకేటి, పద్మనాభం, మీనాకుమారి మొదలగువారు.

పతివ్రతలూ, ప్రేమను నమ్ముకున్నవాళ్ళూ, పిల్లి కష్టాలు పడాలి. అప్పుడు కథలు మాయలతో తోను, మహిమలతోను నిండిపోతాయి. వీటికి తోడు యక్షిణీ, యామినివో, అది కామినివో, మానవుడివో మరులుగొంటే ఆ కథ మహా మాయల మయమే అవుతుంది. స్వర్ణమంజరి కథనిండా మాయలు, మహిమలు, మంత్ర తంత్ర ఘోర భయంకర చిత్రవిచిత్ర యుద్ధ వాగ్యుద్ధాలూ వుండి, మధ్య మధ్య హాస్యం, లాస్యం, హాయిగా పాటలు కలిసి మంచి నీతిగల వినోదాత్మకమైన సినిమాగా రూపొందింది. దీనిలోని ట్రిక్ ఫొటోగ్రఫీ ప్రత్యేకంగా పేర్కొనాలి.

'మంజరి'పై కన్నువేసిన రాజగురువు ఆమె భర్త చంద్రభానురాజుకీ, ఆమెకు ఎడబాటు చేస్తాడు. కన్నెల మారణహోమంతో మహాయోగం సంపాదించుకుందామనుకుంటాడు. అదే చంద్రభాను రాజును యామిని అనే యక్షకన్య మత్స్యకన్యరూపై (శాపవశాత్తు) మోహించి, మరిన్ని మాయలూ, కష్టాలు, స్వర్ణమంజరికి కలిగిస్తుంది. ఆ యక్షిణి 'మంజరి' చేతులు తీసుకుని పరుస్తూ పారేస్తుంది. చివరకు ఎన్నో కష్టాలు, నష్టాల తర్వాత దైవబలం, శిలలం మొదలైననాటి సాయంతో మంజరికి చేతులు వచ్చి కథకు శుభాంతమైన శుభం కలుగుతాయి. ఈ చిత్రంలోని సెట్టింగులన్నీ బ్రహ్మాండంగాను, వింతో వింతంతోను నిండివున్నాయి. అన్నీ మరో లోకాలు. రాణ్ణా, రత్నాలు, లతలూ, పుష్పాలూ అందాలభాగమై నాట్యాలు చేయడం; మనుషులు రాళ్ళై పోవడం, మణులు మహాపర్వతాలై పోవడంలాంటి మాయలూ మాయలేనాక, "టింగు టిటుకు"అనే చిన్న (6 అం. లు) చిన్న "కీచు కీచు" నరులు చేసే హాస్యం, నృత్యం ఉన్నాయి. "శివుడు"నే ఏమర్చి నటనా, 'హనుమాన్' అనే కోతి (చిప్పి) మేకపాలు తీసి పిల్లకు పట్టి లాలించడం, సింహంతో పోరాటం, పులులతో కుస్తీలు, రాక్షస, మానవ మరోలోకాలు ఇలా అంతా ఓ మాయాజాలంగా, పెక్కు కాలక్షేపంతోపాటు సాంకేతిక ప్రజ్ఞ, సంగీత ప్రతిభ ఉన్నాయి. దీంతో ట్రిక్ ఫొటోగ్రఫీలో తెలుగు సినిమా మరోమెట్టు ఎక్కింది. చేతులులేని మంజరిగా స్వర్ణమంజరి "హ్రీం" చిత్రంలో చాలా మేర అన్ని సిస్తుంది. ఈ క్లిష్టమైన పాత్రను అంజలి సమర్థవంతంగా పోషించింది. చంద్రభానునిగా శ్రీ రామారావు విందుగా, హాయిగా నటించారు. జయంతి మత్స్యకన్యగా, మరులుగొన్న యామినిగా నటించి, తనకు దొరికిన పెద్ద అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నది. 'అప్పుడైతే' అనే ఊతపదం 'దక్షిణం గుత' కాలాదికాని ఈ జానపదంలో పదే పదే వాడుకొన్నారు, మరి ఎందుకనో? పద్మనాభం హాస్యం అది మినహాయిస్తే బాగుంది. పాటల సాహిత్యం మధురంగా, సంగీతం హాయిగానూ సాగిపోతుంది. ఈ చిత్రంలో శ్రీ మల్లాది రచన పసందుగా పదునుగా నడిచింది. ఆబాలగోపాలం చూడదగ్గ చిత్రం. ★



"సప్తగిరి కొండల" రికార్డింగ్‌లో నేపథ్య గీతం పాడుతున్న ఘంటసాల. ప్రక్కన వున్నది—దర్శకులు వై. రంగారావు, వెనకవున్నవారు 'హాస్యంగి గన్స్' ఫొటో: రూప

# రమణమూర్తి

13 వ పేజీ తరువాయి

చిత్రం మొదలుపెట్టలేదు. మొదలుపెట్టినప్పుడు తప్పకుండా పిలుస్తాను." అన్నారు ప్రసాద్‌గారు. ఆవెంటనే ఏ బండీవుంటే ఆబండీ ఎక్కేసి, రమణమూర్తి శ్రీకాకుళం చేరుకున్నాడు.

కారణాంతరాలవల్ల— ప్రసాద్‌గారు తెలుగు చిత్రం ప్రారంభించలేదు. అప్పుడు దర్శక—నిర్మాత తిలక్ 'యం. ఎల్. ఏ' మొదలెట్టబోతున్నారు. అందులోని 'రమేశ్ పాత్రకు ఎవరా' అనుకుంటూ వుంటే, ప్రసాద్‌గారు రమణమూర్తి పేరు సూచించారు. కొన్నిగంటలలోనే— వెంటనే రావలసిందిగా రమణమూర్తికి టెలిగ్రామ్ చేరింది. ఆమర్నాడే అతను మద్రాసుకు ప్రయాణంకట్టాడు!

సినిమాభాగ్య పిలక పుచ్చుకుని లాగినట్టు— రమణమూర్తిని లాగింది. యం. ఎల్. ఏ. లో అతను 'రమేశ్' పాత్ర ధరించాడు. నాటకానుభవంవల్ల సినిమానటన అంత కష్టంఅని అతనికి అనిపించలేదు. తిలక్‌గారు అతనికి ప్రతీదీ శ్రద్ధగా చెప్పి— జాగ్రత్తగా తీశారు. మొదటి చిత్రంలోనే అతను పేరుతెచ్చుకున్నాడు.

"నేను నాటకాల్లో నేర్చుకున్న పాఠాలు, సినిమాకు ఎంతగానో వుపకరించాయి. నాటకానుభవం వుండటం, సినిమాకు ఎంతైనా అవసరం— ముఖ్యంఅని నా అభిప్రాయం. సినిమాలలో నన్ను ప్రవేశపెట్టిన నాటకాలను నే నెప్పుడూ మరిచిపోలేదు. సినిమాల్లోకి వచ్చిన తర్వాతకూడా నేను నాటకాల్లో చాలాసార్లు పాల్గొన్నాను. ఇంకాఇంకా పాల్గొంటాను" అన్నాడు రమణమూర్తి.

ఆ అభిలాషవల్లే, రమణమూర్తి ప్రస్తుతం పెద్దఎత్తున ఒక నాటకాన్ని తయారుచేస్తున్నాడు. మంచిపద్ధతుల్లో— శిక్షణాయుతంగా అతను వూరూరా, ఈ నాటకాన్ని త్వరలో ప్రదర్శించబోతున్నాడు!

రమణమూర్తికి సరదాగా కబుర్లుచెప్పటం అంటే చాలాఇష్టం. తను నవ్వుతూ, ఇతర్లను నవ్వించటం అనేది, సాధారణంగా అతనిదగ్గర దొరుకుతుంది! చదరంగంతోనూ, పిల్లలతోనూ ఆడుకోటం, ఏదన్నా చదువుకోటం,—అతని సరదాలు. రమణమూర్తికి ఇద్దరు ఆడపిల్లలు!

యం. యల్. ఏ. చిత్రంతర్వాత అతను 'మాంగల్య బలం', 'మంచిమనసుకు మంచిరోజులు', 'శభాష్ రాముడు', 'అత్తా ఒకింటి కోడలే', 'పెళ్ళి మీదపెళ్ళి', 'అన్నాచెల్లెలు', 'బావామరదళ్ళు' 'గుళ్ళో పెళ్ళి', 'బాటసారి', 'పెళ్ళితాంబూలం', 'అప్పగింతలు'—చిత్రాలలో నటించాడు. 'రేణుకా మహాత్మ్యం'లో 'గెస్టునారదుడుగా' కనిపించాడు.

ప్రస్తుతం రమణమూర్తి—ఆర్. ఆర్. పిక్చర్స్ వారి సాంఘికంలోనూ, 'ఆశాజీవులు', 'కటుల మీదపెళ్ళి'లోనూ నటిస్తున్నాడు. ప్రముఖ దర్శకుడు బి. యన్. రెడ్డిగారి దర్శకత్వంలో రాబోతున్న, శంభూవారి 'పూజాఫలం'లో ఉపనాయకుని పాత్రకు ఇటీవలే నిర్ణయింపబడ్డాడు! ★

—'సు.'

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది!

# పగిలిన గ్లాసు మీ పిక్‌నిక్‌ని నిరుత్సాహ పరచనక్కర్లేదు



## బర్నాల్ పూయండి

మీ రెంతో వరదాగా వుంటారు. బర్నాల్ మీకు శీఘ్రోపశమనము కలిగించి,-, గుణమునిచ్చును. కాటులకు, కాల్పులకు, చిన్న పురుగులు కుట్టుటకు, ఎగ్జిమాపన్లకు బర్నాల్ ఆదర్శమైన యాంటీ సెప్టిక్ పూతమందు.

మీరు మరల పిక్‌నిక్‌లకుగాని, ప్రయాణాలకుగాని వెళ్లునప్పుడు ఒక బర్నాల్ ట్యూబుని తీసుకు వెళ్లండి – మీకు దాని అవసరం వుండవచ్చును.




# బర్నాల్

ఆదర్శమైన యాంటిసెప్టిక్ పూత మందు-
20 సం॥లకు పైబడి ప్రఖ్యాతిగాంచినది.

ఫెనాక్స్, గ్రిమిక్స్ తయారుచేయు Boots
బూట్స్‌వారి శ్రేష్ఠమైన తయారు

**ఉచితము** మీరుకొనే ప్రతీ బర్నాల్ ట్యూబుతోను ఒక అందమైన అడుగుబద్ద యివ్వబడును

NATIONAL BB-161

# చిత్రఖేదమ్ము



"మాయా మోహిని"లో లీలావతి, ఉదయకుమార్.

"మరో మేకప్ మనిషిని పెట్టరాదూ ?" అన్నాడు ఫలానా.

"ఏం—మిచ్చిస్తావా డబ్బు !" అని, అతను తగ్గి—"లేదయ్యా, నీ షాటు రెండు, మూడు గంటలప్పుడుగాని రాదు. అందుకనే ముందుగా నిన్ను తీసుకొచ్చి యిక్కడ బాధపెట్టడం ఎందుకని, పదికొండుకు తీసుకొచ్చాము" అన్నాడు నవ్వుతూ.

"సరే—నా కేదేనా టిఫినూ, కాఫీ ...." అన్నాడు ఫలానా.

"ఏకంగా రెండవనీ—బ్రేక్ చేదాం. బ్రేక్‌లో టిఫినూ, కాఫీ .... పంపిస్తానూ" అని ప్రొడక్షన్ మనిషి వెళ్లిపోయాడు.

"ఆహా ! గురూ, చూశారా" అన్నాడు ఫలానా, నావేపు తిరిగి.

నేనేం అవలేదు. అటూ యిటూ చూస్తూ ఉండగా, తెలిసిన ఒకాయన కనిపించి—విష్ చేశారు.

"బాగున్నారా" అన్నాను.

"మీ దయవల్ల."

"ఏమిటి పిక్చరు ఏదేనా మొదలెడుతున్నారా, లేదా ?" అని అడిగాను నేనే, ఒకవేళ అటువంటి ప్రశ్న ఏదన్నా నన్ను అడుగుతాడేమోనని భయంవేసి.

"ఆఁ—ఎక్కడండి .... ఫిల్ము లేదు, .... మనం ఎక్కడ ఇబ్బంది పడతాం ! కొన్నాళ్లలో మన దేశంలోనే ఫిల్ముఉత్పత్తి జరుగుతుందటగా—అప్పుడైతే మనిష్టం" అన్నాడు—వెళ్లిపోతూ.

ఆరాత్రి యింకెవరూ కనిపించలేదు. రెండు గంటలకు ఫలానా మొహానికి కొత్త తెల్లరంగూ, ఎర్రరంగూ పులుముకుని వచ్చాడు.

"చూశారా—గురూ, ఈ మహద్భాగ్యానికే ఇంత సేపయింది. ఏదో స్పెషల్ మేకప్ అనుకున్నాను. రంగు సరిగా వెయ్యవయ్యా అంటే—'బాగు, లాంగ్‌షాట్‌లో ఉంటావు—కనిపించదు' అని పంపేశాడు." అన్నాడు ఫలానా. ఆతర్వాత, ఓ రొట్టె ముక్కా, ఇంత కాఫీ యిచ్చారు. నా కిప్పటానికి చాలా తమాషాగాయుంది, ఆ తర్వాత యిచ్చినట్లు అర్థమైంది. సంకేతంటే, అందరికీ యిస్తేసిన



"మనుష్య - నేనా"లో రాజశ్రీ, కాంతారావు.

# చిత్రఖేదము

అరగంటకుగాని షాకు యివ్వలేదు!

తెల్లవారిపోయి, ఆరుగంటలైపోయింది. కాఫీ టైమైపోయింది. ఫలానాకు షాట్ రాలేదు. రంగు తుడిచేసుకుని పొమ్మన్నారు. వస్తే మళ్ళీ కబురు చేస్తాం అన్నారు. ఆ అన్నాను తలచుకుంటూ—ఇద్దరమూ, నిద్రలేక తూగిపోతూ, కళ్ళు మండిపోతూ—సెర్క్యుదగ్గర దిగి—ఒక చెట్టుకింద చేరి, గడ్డిలో పడి చిత్తుగా నిద్రపోయాము!

"చిత్రఖేదం చూశావా ఫలానా" అన్నాను నేను ధార్బ్సనూ, సెర్క్యులోనూ.

ఫలానా మాట్లాడలేదు; అతను చాలా కోపంగా ఉన్నాడు.

ఆరోజు మధ్యాహ్నం మెలకువ వచ్చింది. ఫలానాను లేపాను. సూర్యుడు నడినెత్తి దాటిపోయాడు. ఒంటిగంటో రెండో అవుతుంది. కడుపులో బ్రహ్మాండమైన ఆకలి వేస్తున్నది. చేతిలో కానీ లేదు. ఫలానా, దిగ్గున లేచి కూచుని—"దీం దుంప తెగ—ఏం ఆకలి గురూ! .... చచ్చాను! ఉండండి గురూ .... ఇప్పుడే వస్తాను ...." అని చరచరా వెళ్ళిపోయాడు.

నా అవస్థకు నాకు నవ్వు వచ్చింది—ఏడుపూ వచ్చింది. ఎన్నాళ్ళని ఈ అవస్థలు, బాధలు ఇట్లా పడాలి? ఈ ఖర్మం ఎందుకు పట్టినట్టు? హాయిగా ఇంటిపట్టున పడివుంటే—ఉన్నా, లేకపోయినా, లేకకింత తిండయినా తినవచ్చును. ఉన్న పొలం ఏదో చూసుకోవచ్చును. ఇంటిదగ్గర, బంధువులంతా గుర్తుకొచ్చారు. ఇక్కడ ఈ బాధలు ఇంక పడలేను—ఇంటికిపోయి పడివుంటాను అని తేల్చుకున్నాను.

అరగంట పోయాక, ఫలానా పరుగెత్తుకుంటూ వచ్చి—"పదండి గురూ, హోటలు కట్టేస్తున్నాడు. పదండి పదండి" అని తొందరచేశాడు.

"ఎందుకూ?" అన్నాను.

చేతిలో రెండు భోజనం టిక్కెట్లు చూపిస్తూ "పదండి మరి, సంపాయించాను. లేకపోతే తప్పేమా!" అన్నాడు ఫలానా పరుగెత్తుతూ.

పరపరా హోటలు చేరుకుని అక్కడే మొహాలు కడుక్కుని, వాడు ఏం పెడితే దాన్నే అమృతం అనుకొని—కడుపు నింపుకున్నాము. బయటకొచ్చాక—"ఫలానా! నేను మా వూరు వెళ్తున్నాను. ఎలా వెళతాను అని అడక్కు. వెళతాను. మళ్ళీ వస్తాను. వీలైతే నేనే నో పార్టీని తీసుకొచ్చి—మంచి చిత్రం తీస్తాను. నువ్వు చేసిన మేలు మాత్రం మరిచిపోలేను. థాంక్స్" అన్నాను. ఎప్పుడూ హుషారుగా ఉండే ఫలానా, ఒక్కసారి దిగులుపడ్డాడు. కళ్ళమ్మట నీళ్ళు కూడా పెట్టుకున్నాడు.

"టిక్కెట్టు కొనడానికైనా, దారి ఖర్చయినా ఉండాలిగా గురూ—నాదగ్గరేంలేదు ఇవ్వటానికి ..." అన్నాడు—విచారంగా.

"బాధపడకు. ఏం ఫర్వాలేదు. మళ్ళీ వస్తాను. తప్పకుండా వస్తాను...." అని, ఫలానా చేతిని తీసుకుని, నొక్కి, వూపి—"విష్ యూ గుడ్‌లక్" అని వెళ్ళిపోయాను. ఆ వెళ్ళిపోవటం, పోయిపోయి సెంట్రల్ చేరుకున్నాను. రాత్రి బయల్దేరే కలకత్తా మెయిలులో పడ్డాను. దార్లో మధురన్నా 'టిక్కెట్టు అడిగితే—దిగిపోవటానికి గాని, వాళ్ళు వేసే శిక్షకు గాని సిద్ధపడే ఉన్నాను. నేను చేస్తున్నది నేరమే అయినా—పరిస్థితులనుబట్టి అట్లా ప్రవర్తించవలసి వచ్చింది. అదృష్టవశాత్తూ, నేను పట్టుబడలేదు. మొత్తానికి ఈ ఊరు చేరుకున్నాను. విన్నారా—ఈ బాధలూ .... దుఃఖాలూ, విచారాలూ .... ఇవన్నీ విన్నారుకదూ! వీటినే మొత్తంగా చేరిస్తే "చిత్రఖేదము" అనబడుతుంది. ఆ మొత్తం అంతా మీకు సాక్ష్యంగా వివరించాను" అని, కదిలాడు మహాశయుడు—నిట్టూరుస్తూ. ★



"సిరిసంపదలు" నాగేశ్వరరావు, కాశీనాథ్, సావిత్రి.



"కులగోత్రాలు"లో సూర్యకాంతం, రేలంగి.

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**

# 14 - 9 - '62

## సంచిక నుంచి ప్రారంభం

# కీ. శే. మారిలిన్ మన్రో

## ఆత్మకథ

నేనుకలది యనుటకు, నిత్యవరిణామి యనుటకు కారణము తెలిసినది.

పౌం(డకు డిట్లువన్యసించినాడు: "భో! భో! మహా(బాహ్మణులు! మీరు సర్వధర్మరక్షకులు. సర్వధర్మ వ్యాఖ్యాతలు. మేము ఆ మీరు చెప్పునది ఆచరించువారము. ధర్మమును రక్షించుటయు కదా రాజుయొక్క ధర్మము. ఆ ధర్మమును మేము రక్షించెదము. మరి ఆ ధర్మము వర్ణా(శమ ధర్మమర్యాదముగా సాగుచున్నది. దీనికి వ్యతిరేకముగా నేమి జరిగినను ఈ ధర్మము చ్యుతిచెందు చున్నది. మాకు ఆచార్యులు, గురువులు, ఉపాధ్యాయులు మహానందులవారు. వారీ సభలో లేరు. వారు ధర్మమునకు వ్యతిరేకముగానడిచినారని అభియోగము వచ్చినది. పరోక్షముగ వారినివిచారించుట

# హరివంశము

9-వ పేజీ తరువాయి

న్యాయ్యమా! ఆ విషయమును సభవారు నిర్ణయించవలయును. మేము వారికొరకై కాశిక యంతయు వెదకించినాము. వారు కన్పించలేదు. అందువలన ఈ ధర్మసందేహము కల్గినది."

అని పౌం(డకు డాగినాడు. సభలోనెవ్వరును మాటాడలేదు. అందరును ఆచార్యసాందీపని దిక్కై (కమా(తముచూచిరి. ఆయన పరమమైన శాంతముతో కూరుచుండెను. రాజు ఈ మాట యనగా మందహాసముమా(తము చేసెను.

పౌం(డకు డిప్పుడు ఆచార్య సాందీపనినే సంబోధించెను. "ఆచార్యసాందీపని! తమరు పెద్దలు. తమ అభి(పాయ మేమి?"

"మహారాజ! దోషిని ఇట్టి సందర్భములలో పరోక్షమునగూడ విచారించవచ్చును. ఆయన వాని చేసిన దోషమేమియు లేదు. అది నిష్పవించుట మేము సభకు వచ్చితిమి."

పౌం(డకుడు గల్లున నవ్వెను. "నేనును అదిదె యనుకొనుచున్నాను. ఆచార్యమహానందులు కాశినివిడిపోయినచో, అందుకు కారణ మెవ్వరై యుందుర గూడ నేను ఆలోచించినాను. అది తాముగూ ఆలోచించియేయుందురు......"

అని పౌం(డకుడు తనదృష్టిని (శీకృష్ణదేవునిపై (పసరించెను. సభయు చటుచూచెను. (శీ కృష్ణుడు మాటాడలేదు. మందహాసముమా(తము చేసెను. పౌం(డకున కది కశాఘాతముతో నుండెను. తా

---

ఇదీ వరస—9

మందర్






# కొత్తనుడికట్టు-6

## అడ్డం

1. మిక్కిలి వనితే!
3. తడవ.
7. ఇది టాగూర్‌కి ఉండేది!
9. క్రీతం.
11. దుస్తు పరికరం.
13. పెంచే స్త్రీ.
14. ఎల్లా తిరగబడింది!
15. ఇది కంట్లో పడితే నీరు కారవచ్చు.
17. వినాయకుని వాహనం.
19. ఈ చెట్టు కాయలనేకాక, ఆకులు కూడా తింటారు.
20. ఒప్పుకాదు!
21. మన్మథుడు.

## నిలువు

2. ఈ రాతి పరికరంతో వినవచ్చు!
4. మాట!
5. ఈ రంగు రాత్రికి ఉండవచ్చు.
6. పడవ తల్లక్రిందులు!
8. సంతోషించదగినది.
10. ఇవి నోటి వెంట గ్రక్కుతారంటారు
12. మూడడుగులు ఎన్నో?
15. ఊరు.
16. పది అంకెలో సగం.
17. లెక్కలు నేర్చుకునేటప్పుడు ఆరోహించును!
18. కవిత్వమే!

---

5 వ-కొత్త నుడికట్టుకు జవాబులు,

అడ్డం:

1. పూర్ణిమ 3. ముగ్లఆం (ఆంగ్లము) 6. పాతకాపు, 7. మాదిరి, 8. సీత 9. ముని 10. మిగడ 11. తుద 12. పాట 13. కనుద (దనుక) 14. పూరిపాక 16. సంఖ్యలు 17. పాసీతా (తాసీపా.)

నిలువు:

2. మడత 3. ముడుపు 4. ఆంధ్రమాత, 5. గురివింద 6. పాణిని, 8. పీడ 9. ముల్లుకర్ర 10. మీట 11. తురక 12. పాదరసం 14. పూజలు 15. పాదుషా.









# పొట్టి కథలు

## పక్షపాతానికిపోతే....

శాస్త్ర మద్యం పుచ్చుకున్నాడు రాజు. మరికొంచెం తాగాడు రాజరాజు. ఇద్దరూ మంచి దోస్తే. పరోపకారపరాయణత్వం వాళ్ళ సొత్తు. వెన్నెల రాత్రిలో జోగుతూ వస్తున్నారు. దారి కటూ యిటూ నిలబడి నిద్దరోతున్నట్లు పెద్దభవనాలు.

ఆ కొసని ఒక పొడుగాటి వ్యక్తి మసకవెల్తురులో మరో పొట్టివ్యక్తిని పట్టుకుని మెడ బట్టి లాక్కుపోతున్నాడు. పొడుగైన వ్యక్తి చాలా బలమైన వాడేగాని పొట్టివాడుకూడ గట్టివాడే. చిరుతలా పెనుగులాడుతున్నాడు. ఈ పరోపకార మూర్తులకు ఒళ్ళు మండింది. వెంటనే వెళ్ళి పొడుగుపాటి వ్యక్తి మీద తిరగబడ్డారు. అదాటున ఇద్దరు పిల్లుల్లా మీదబడేటంతో పులిలాంటి ఆ వ్యక్తి పొట్టివాణ్ణి వదిలేశాడు. వాడు పారిపోయాడు. పొడుగైన వ్యక్తికి ఆవేశం కోపం దుఃఖంకూడా వచ్చాయి. "మీ ఇద్దర్నీ అరెస్టుచేస్తున్నా" నంటూ తన జేబులోనుంచి పోలీసు సి. ఐ. డి. అని తెలిపే బిళ్ళ చూపించాడు. "ఇప్పుడు మీరు సాయపడ్డవాడు పగటిదొంగ... పదండి వాడికి బదులు మీ ఇద్దరూ" అంటూ లాక్కుపోయాడు. మొత్తుకున్నారు మిత్రులు. ఎట్టకేలకు చెరో పది జరిమానా వేసి వదిలేశాడు సి. ఐ. డి.

విద్యారాణి (మగోరాణి పేట)

* * *

## అమరం :

"బామ్మైపోయాక సుకుమారికి కారు నడపా లనిపించింది. కాని మనుమడన్నాడు "బామ్మా! ప్రమాదం సుమా. మర్చిపోయావేమో ముప్పై యేళ్ళయింది నువ్వు కారుడ్రైవింగ్ మానేసి." బామ్మ నవ్వింది. "భలే! డ్రైవింగు అంటే ప్రేమించడం లాంటిదిరా అబ్బీ! మరుపూ గిరుపూ దానికంటవు. అదీ అమరం. మీ తాతయ్య నాకింకా బాలకుమారుడిలా అగుపిస్తారు."

పి. శ్రీనివాస్, (బెజవాడ)

* * *

## పాక ప్రావీణ్యత?

శ్యామల మొదటి దఫాగా దవ్వకూర చేస్తానంది. సరే నన్నారు భర్త "రావు" తమ్ముడు "గిరి". సాయంకాలం వస్తూనే ఆమెను దవ్వకూర వండావా అని అడిగారు బావ మరదు లిద్దరూ.

"వండను గాని అది మీకు వడ్డించేముందొకమనవి." శ్యామల చెప్పింది. అది సిభ్బగా రి పోయిందని మీరు గ్రహించగానే మీరు నన్ను తిట్టవద్దు. వెక్కిరించకూడదు. తిన్నగా హోటలుకు పోదాం.

"సరే" నన్నారు రావూ, గిరి, శ్యామల వంటయింటినుంచి వచ్చేసరికి యిద్దరూ సూటూ బూటూ బిగించి సిద్ధంగా వున్నారు.

శ్యామల కూర వడ్డించక మునుపే వాళ్ళకు తన ప్రజ్ఞ తెలిసినందుకు ఆనందపడింది. "పదండి అటునుంచి అటు సినిమాకూడా పోదా"మంది."

అనంత భానుప్రసాద్

* * *

## మార్క్ ట్వేన్ లు?

మార్క్ ట్వేన్ ప్రఖ్యాత రచయిత అందరికీ తెలుసు. కాని అతనిలాగే అచ్చం పోలికలున్న అనేకులు సాధారణంగా ఆయన వాళ్ల ఫోటోలు పంపిస్తూ వుండేవారు. "అయ్యా మేం మీలాగే వున్నాం చూడండి" అంటూ రాసేవారు. రోజుకో మార్క్ ట్వేన్ ఆయనకు తన ఫోటో పంపేవాడు. ఆ రచయితకు బాధ కలిగిందిగాని ఓ ఉపాయం కూడా తట్టింది. వెంటనే ప్రెస్సుకి కబురు పెట్టి ఒక వుత్తరానికి ఓ వంద కాపీలు కొట్టి యివ్వమన్నాడు. ఆ వుత్తరం యిది:—

"అయ్యా! మీరు దయతో పంపిన ఫోటో అందింది! వాస్తవంగా మీరు నాలాగేవున్నారు. అంతవరకూ ఎందుకు? నేను నాలాగే వున్నంతకంటే ఎక్కువగా మీరు నాలాగే నా పోలికలు కలిగివున్నారు. నిజానికి మిగతా నన్ను పోలినవారికంటే మీరే నన్ను ఎక్కువ పోలివున్నారు. అవసరమైతే అది, వాడుకుంటాను కూడ చిత్తగించవలెను.

ఆర్. చినరామసామి (పెనుకొండ) ★

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor : S. Sambhu Prasad.



అయనార్ విగ్రహాలు

ఫొటో: టి. మాధవరావు.(మద్రాసు)

